

శ్రీ శ్రీ శ్రీ
శ్రీ విక్రమ దేవ వర్మ మహా రాజు
గారు

శ్రీ త్రిపురాన
వేంకట సూర్య ప్రసాద రావు
దొర గారు

# మొయిలు రాయబారము

(ఏకపాత్ర నాటిక)

శ్రీ కాళిదాసుని మేఘసందేశమునకు
స్వతంత్ర దేశీయ గేయానువాదము.

ఇది

శ్రీ జయపురాధీశులు, "సాహిత్యసమ్రాట్" బిరుదాంకితులు,

అగు

శ్రీశ్రీశ్రీ శ్రీ విక్రమదేవవర్మ మహారాజుగారి

# పెంపుడుబిడ్డ

శ్రీ దంతహుండా మాల్కాదారులు, "ఆంధ్రకాళిదాస"

"కవిభూషణ" బిరుదాంకితులు, శ్రీ జయపుర సంస్థాన

గౌరవాస్థాన కవులు,

అగు

శ్రీ త్రిపురాన వేంకటసూర్యప్రసాదరాయకవిగారి

# కన్నబిడ్డ

# ఆశయము

దేశ కాల విభేదము లేక యన్ని జాతులలోని యన్ని
తరములలోని రసికుల నాకర్షించి విశ్వజనీనము లైన
మహాకావ్యములలోఁ గాళిదాసుని మేఘసందేశ మొకటి.
ఆ గ్రంథ రాజమునకుఁ బ్రాక్పశ్చిమ దేశ భాష లనేకము
లలో ననేకానువాదములు పుట్టినవి. ఒక్క యీ శతాబ్ది
లోనే మన యాంధ్రమునఁ గూడ దాని కెన్నో ప్రతి
బింబములు వెలసినవి. శ్రీ త్రిపురాన వేంకట సూర్య
ప్రసాదరావు గారి యీ "**మొయిలు రాయబారము**"
వానిలో నొక్కటి యయ్యు గుణ విశేషముచే గణ్య
మై "కట్టు దప్పని స్వాతంత్ర్య గరిమఁ" జూపు చున్నది.

కవి కుల సార్వభౌముఁడు తన రచనను శ్లోక మయ
మైన శ్రవ్య కావ్యము గా నే యుద్దేశించెను. ఇఁక నీ
తెలుఁగు బిడ్డ యో "పద్దెమ్ములోఁ బాట పాటలోఁ
బద్దెమ్ము గూడి రా హాయి గాఁ బాడ నేర్చు. గా నాభి
నయ నాట్య కవితా కళలఁ గూర్చి యరుదార నాటకా
లాడ నేర్చు." అను కర్త చూపిన స్వాతంత్ర్య గరిమ, తల్లి
యెఱుఁగని యీ విద్దెలు కూఁతునకు నేర్పుట యందే

కలదు. అట్లయ్యు నీ పుత్త్రిక విశృంఖల విహార మొనర్చు గడుసరి కాదు. మఱి, కట్టు దప్పకుండఁ దల్లి యడుగు జాడల నడచు వినీతి సంపన్న.

కవిగారు, కృతి రచనలోఁ జూపిన క్రొత్తఁదనము నే, కృతి ప్రదానమునను జూపి, "మేఘమునకుఁ దాను గూర్చిన యపూర్వంపు మెఱుఁగు" నకు నిం కొక వన్నె పెట్టిరి. అనే కాంధ్ర కావ్యములకు భర్త లైన శ్రీ విక్రమ దేవ వర్మ మహారాజు గారు, ఈ కృతి కన్యకను ముద్దుతో దత్త పుత్త్రిక గా స్వీకరించి, భక్తితో శ్రీరామ చంద్రునకు ధర్మ పత్ని గా సమర్పించిరి. అహో! ఎంత సుకృత మిది. తొల్లి సీతా కళ్యాణ వేళ జనక రాజర్షి కి లభించిన యశః పుణ్యము లే విజ్ఞాన జనకు లైన మా మహారాజు గారికి లభించినవి.

ఈ విధముగా సర్వ విధ మూత్మ త్వముచే నొప్పారు నీ **"మొయిలు రాయబారము"** "ఆంధ్ర భాషా విభూష యై యలరుఁ గాక!"

ఆంధ్ర విశ్వ కళా పరిషత్తు<br>11-9-1940 } కట్టమంచి రామలింగా రెడ్డి

# మొయిలు మెఱుఁగులు.

శ్రీ త్రిపురాన వేంకట సూర్య ప్రసాదరావు దొర గారు నాకు నచ్చిన నెచ్చెలి. ఈ చెలికారమునకుఁ గారణము వారి సరస కవితా చాతురి యే. కాళిదాస భవభూతుల ఘనకృతులను వారు తీరుతియ్యములు వెలయ నింతకు ముందే తెలిఁగించిరి. అపూర్వ సౌందర్యము మెఱయఁగా సంస్కృత కృతుల నాంధ్రీకరించుట యందు వారం దె వేసిన చేయి. ఈనడుమఁ గడుఁ గ్రొత్త తీరున వారు 'మొయిలు రాయబార' మను పేరఁ జేసిన మేఘసందేశపుఁ దెలుఁగు సేఁతను వారిముఖమున నే విని తనిసితిని. అది కాళిదాసుని 'మేఘము' నకు మెఱుఁగులు వెట్టు నదిగా నున్న ది. ఆసంస్కృత కాళిదాసు సందేశమును, ఈయాంధ్ర కాళిదాసు రాయబారమును బురస్కరించుకొని కవిసాహార్దానురోధమున నుభయ కవితా ప్రశస్తుల నించుక యుగ్గడింపఁ గడఁగుచున్నాఁడను.

## కాళిదాసు.

కవి కుల గురు వగు కాళిదాసుని కృతులు రఘువంశ కుమార సంభవ మేఘసందేశము లని కావ్య త్రయ

మును, శాకుంతల, మాళవికాగ్నిమిత్రీయ, విక్రమోర్వశీయము లని నాటక త్రయమును, ఋతుసంహార మని ఋతువర్ణనాత్మక మగు లఘు కావ్యమును బ్రసిద్ధము లై ముద్రితములు నై యున్నవి. కుంతలేశ్వర దౌత్య మని యొక కృతి (కావ్యమో నాటకమో) కాళిదాసునిదిగా భోజుఁడు తన శృంగార ప్రకాశమునఁ బేర్కొని దాన నుండి యొక శ్లోకము నుదాహరించెను.[1] విక్రమార్కుఁడు కుంతలేశ్వరుని కడకుఁ గాళిదాసు నెందుకో రాయబారిగాఁ బంపుట యందలి కథ యఁట! ఈ గ్రంథము నౌచిత్య విచార చర్చలో క్షేమేంద్రుఁడు నుదాహరించినాఁడు.[2] కాన యది కాళిదాసుని కృత్యంతరముగా

1 శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు కుందమాలా నాటక పీఠికలో పై విషయము వివరించిరి. కుంతలేశ్వర దౌత్య శ్లోక మిది:—

శ్లో. అసకల హసితత్వాత్ క్షాళితా నీవ కాన్త్యా
ముకుళిత నయనత్వాత్ వ్యక్త కర్ణోత్పలాని,
పిబతి మధు సుగంధీ న్యాననాని ప్రియాణాం
త్వయి వినిహిత భారః కుంతలానా మధీశః.

9 వ ప్రకాశము.

2 అధికరణౌచిత్యం యథా కుంతలేశ్వర దౌత్యే కాళిదాసస్య:—

'ఇహ నివసతి మేరుః శేఖరః క్ష్మాధరాణా

గణింపవలసినదే యగును. 'చిద్గగనచంద్రిక' యని దేవీ స్తోత్రాత్మకము కాళిదాసీయముగాఁ గానవచ్చుచున్నది.[1] ప్రాచీనులు దానిఁ బేర్కొనిరఁట. ఇంకను శ్యామలా దండ కాదు లేవేవో కాళిదాసకృతులుగా వ్యవహృతము లగుచున్నవి కొన్ని యున్నవి గాని యవి యాతనికృతు లే యని విశ్వసించుటకుఁ దగ్గ యాధారములు గాన రావు.

కాళిదాసు క్రీ. పూ. ప్రథమశతాబ్దివాఁ డని కొందఱు, క్రీ. త. నాల్గవశతాబ్ది వాఁ డని కొందఱు నందురు. దిఙ్నాగాచార్య ప్రశంస మేఘసందేశమునఁ గల దనియు, నా దిఙ్నాగుఁడు క్రీ. త. తృతీయ శతాబ్ది తుదివాఁ డనియుఁ, గాన కాళిదాసు క్రీ. త. నాల్గవశ తాబ్దివాఁడు గాఁ దగు నని చతుర్థ శతాబ్దీవాదులు తలఁచు చున్నారు. దిఙ్నాగుని కాలము సుస్పష్టము గా లే దనియు నాతఁడు ప్రథమశతాబ్దివాఁడని కూడఁ దలఁపఁ దగిన

---

మిహ వినిహిత భారాః సాగరాః సప్త చాన్యే
ఇద మహి పతి భోగ స్తంభ విభ్రాజమానం
ధరణి తల మిహైవ స్థాన మస్మ ద్విధానామ్.

1 ఇది ప్రాచ్య లిఖిత పుస్తక శాలలో నున్నది.

వాఁ డనియుఁ, గాళిదాసు విక్రమార్కుని సభ లోని వాఁ డను ప్రఖ్యాతి చిరంతన మనియుఁ, గాన యాతఁడు క్రీ. పూ. ప్రథమ శతాబ్ది వాఁ డనుట యుక్త మని ప్రథమ శతాబ్ది వాదులు తలంచుచున్నారు. ప్రథమ శతాబ్ది వాద మే సముచిత మని నా యభిప్రాయము.

విక్రమార్కుఁ డుజ్జయిని రాజధానిగా రాజ్య మేలెను గావునను, మేఘసందేశమున 'వక్రగ పంథా య దపి భవత' ఇత్యాది శ్లోకమున యక్షుఁడు చుట్టు త్రోవ యయినను మేఘు నుజ్జయినికిఁ బొమ్మని చెప్పి యధిక ముగా నుజ్జయినీ వర్ణనము పది పండ్రెండు శ్లోకములలోఁ జేయుట చేతను గాళిదాసుఁ డుజ్జయినీ వాస్తవ్యుఁ డని పలువురు తలఁచుచున్నారు. ఇది సంగతము గావచ్చును. కాని యీ క్రింది సాధనములఁ బట్టి యాతఁడు గోదావరీ తీరము వాఁ డనియు గుర్తింప నగుచున్నాఁడు. కాళిదాసు వైదర్భ రీతికిఁ బ్రవర్తకుఁ డని యాలంకారికు లనిరి

శ్లో. సిక్తా మధు ద్రవే ణేవ యస్య నిర్విశా గిరః
తే నేదం వర్త్మ వైదర్భం కాళిదాసేన శోధితమ్.

దండి—అవంతి సుందరీ కథ.

సరస్వ తీవ కార్ణాటీ విజయాంకా జయత్యసౌ
యా వైదర్భ గిరాం వాసః కాళిదాసా దనంతరమ్.

వైదర్భీ గౌడీత్యాది రీతులు తొలుతఁ దత్తద్దేశ వాస్తవ్యు లగు కవుల రచనముల ననుసరించి యేర్పడిన వయి యుండు ననుట సంగతము. వైదర్భీ రీతికిఁ గాళిదాసు జనకుఁ డగుటచే నాతఁడు తద్దేశ జనితుఁ డగు ననుట సముచిత మగును. విదర్భ దేశ మిప్పుడు నైజాం రాష్ట్రమున 'బెదర్' అను పేర నున్నది. అది గోదావరీ ప్రాంత దేశమే. మఱియు "సేతుబంధ కారుఁడు ప్రవర సేనుఁడు కుంతల దేశాధీశ్వరుఁ డగుటచేతను, విక్రమార్కుఁడు కాళిదాసుని రాయబారిని గాఁ బంపినది ప్రవరసేనాదు లగు వాకాటక రాజుల దగ్గఱ కయి యుండఁ దగుటచేతను, నా కుంతల దేశము సరిగా నేఁటి నైజాం రాష్ట్రమే యగుటచేతను, ఉద్యోగ వశమున నుజ్జయినిలో విక్రమార్కు నొద్ద నున్న కాళిదాసు స్వదేశ మగు కుంతల దేశమునకు రాయబారిగాఁ బోవుట సంగత మగుటచేతను, మఱియు మేఘ సందేశమున యక్షుఁడు ప్రవసించిన ప్రదేశము 'రామగిరి' యని యుండుటచేతను, రామగిరి గోదావరీ తీరమున భద్రాద్రి ప్రాంతమున నున్నదే యని దేశ చరిత్రజ్ఞులు ప్రాజ్ఞులు పలువురు ప్రఖ్యాతపఱుచుటచేతను, యక్షునికి రామగిరి

ప్రవాస కల్పనము కాళిదాసు తనకుఁ బరిచిత దేశ మగుటఁ బట్టి కావించినది కాఁదగి యుండుటచేతను, య ట్టిప్రదేశ మునఁ గాళిదాసు తన విప్రయోగ వ్యథనే వర్ణించుకొనె నని పలువురు ప్రాజ్ఞులు భావించుచుండుట విశ్వాస్య మనఁ దగి యుండుటచేతను, నాతఁడు విదర్భ దేశ జనితుఁ డని తలంచుట గూడ యుక్తిసహమే యగును.[1] కాళిదాసు గోదావరీ తీరపు విదర్భదేశమున జనించి మహా కవి యై వైదర్భి రీతి నిర్మాత యై యుజ్జయినిలో విక్రమార్కు నాస్థానమునఁ జేరి యక్కడి కవి రత్నములలోఁ దరళ మై వెలసి యుండ వచ్చును.

## మే ఘ సం దే శ ము.

సంస్కృత వాఙ్మయమున మేఘసందేశమున కసాధా రణ గౌరవము గలదు. స్వరూపమునఁ జిన్నదయ్యును

---

1 రామగిరి చిత్రకూటములు గోదావరీ తీరమున భద్రాద్రి ప్రాంత ముల నున్నవే యని నలువదేండ్లకుఁ బూర్వము శ్రీ కె. వి. లక్ష్మణ రావుగారు తిలక మహాశయుని 'కేసరి' పత్రికలో వాదము సలిపి నిరూ పించిరి. ఆంధ్ర సాహిత్యపరిషద్రజతోత్సవ సంచికలోఁ బైయర్థమే శ్రీ సాగి వేంకట నరసింహముగారి 'రామ గి ర్యాశ్ర మేఘ' అను వ్యాస మున మరల నిరూపింపఁ బడినది.

గావ్యగుణములఁ బట్టి యిది యుత్తమ కావ్య మనఁ దగి నది. కవి కుల గురుని తక్కిన కావ్యముల కంటె నిందు వ్యంగ్యార్థ వైభవ మధికముగాఁ బొందుపడి యున్నది. కొందఱు కాళిదాసు తన విప్రయోగ వ్యథనే యేతత్కావ్య రూపమున వెలార్చుకొనె నందు రని యింతకు ముందే వాకొంటిని. అందలి [1] శ్లోకములఁ బరిశీలింతు మేని యది యట్లే కాఁబోలు నని తోఁచును. యక్షుని విరహా కాతరత, యక్షి సౌశీల్యము, నిందుఁ జక్కఁగాఁ బ్రదర్శింపఁ బడినవి. మేఘ మార్గమున నదీ నగ రాది వర్ణనము, అలకా వర్ణనము, యక్ష నిలయ వర్ణనము, యక్షీ స్వరూ పాది వర్ణనము, సందేశ రీతి, యిం దసామాన్య కవితా చాతురీ ధురీణములు గా నున్నవి. వర్షర్తు రామణీయక మిందు వాల్మీకి వర్షర్తు వర్ణనమును దలఁపించుచు మనోజ్ఞముగా నున్నది. రసిక దంపతి వియోగ వ్యథామాత్ర కథా ఘటిత మై సార్వదేశికము సార్వకాలికము నగు తీరున స్వారస్యము వెలార్చుచుండుటచే నీకావ్యము ప్రపంచ వాఙ్మయముననే ప్రఖ్యాతి కెక్కినది. సంస్కృతమున దీనికి నూఱెంటిదాఁక ననుకరణములు, నిరువదింటి

---

1 పూర్వమేఘమున 16, 25, 26, 29, 38, 39, 45; ఉత్తర మేఘమున, 4, 22 శ్లోకములు చూడుఁడు.

దాఁక వ్యాఖ్యలు వెలసినవి. కాని యీ యనుకృతు లేవియు దీనికి దీటు గాఁ జాలక పోయెను. మేఘసందేశము జాతిరత్నమే. అనుకరణము లెల్లఁ బోఁతరత్నములే. వ్యాఖ్యానము లన్నింటిలో నాంధ్ర దేశీయుఁ డగు మల్లినాథుని వ్యాఖ్యానమే ప్రఖ్యాత మైనది. 'మాఘే మేఘే గతం వయః' అని యాతఁ డనె నఁట. భారతీయుల యెల్ల భాషలలోను నింక నెన్నో ఖండాంతర భాషల లోను నిది పరివర్తిత మై చిత్తరువులతోఁ గూడ ముద్రిత మై వెలసినది. మన దేశమున నే నెఱిఁగి నంతలో నింతకు ముం దిది వంగ భాషలోను హిందీ భాషలోను బద్యరూప పరివర్తనములతోఁ జిత్రములతో ముద్రిత మైనది.[1] ఇట్లిది భాషాంతరములందుఁ బరివర్తనములఁ బడయుట య

---

[1] వంగ చిత్రములలోఁ గొన్ని చాల సుందరము గా నున్నవి. రంగుల యచ్చు దానఁ జాల మేలిమి కెక్కినది. నాగరీ ప్రచారిణివారి హిందీ ముద్రణమునఁ గూడఁ గొన్ని చిత్రములు చక్కఁగ నున్నవి.

'చిత్ర కళా కోవిదుఁ' డగు శ్రీ తలిసెట్టి రామారావుగారి యాంధ్ర ముద్రణమునఁ గడుఁ జక్కని చిత్రముల రచియించిరి. ఇందుఁ జిత్రరచన తెలుఁగు పోలుపులతో నున్నది. యక్షుని మేఘాలోక చిత్ర మిందు సుందరతరము.

ట్లుండ మన తెనుఁగుననే యిర్వదింటి కించుమించుగాఁ బద్య రూప పరివర్తనములఁ బడసినది. సంస్కృతాంధ్ర భాషా సర్వంకష ప్రజ్ఞు లగు శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రిగారు ప్రతి పద టీకా తాత్పర్య వివరణ పద ప్రయోజ నాదులతో దీనిని బ్రకటించుట యాంధ్రులకు బహూపకారక మయ్యెను. ప్రాచీన వర్తమా నాంధ్ర కవీశ్వరు లనేకులు తెలుఁగు సేసిన మేఘ సందేశముల నెన్నింటినో నే నెఱుఁగుదును గాని వానిలోఁ బెక్కింటి కంటె శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు కొంత స్వాతంత్ర్య ముతోఁ జేసిన తెలుఁగు సేఁత గుణోత్తర మనుకొంటిని. అది యట్టిది గాఁ దోఁచుట చేతనే కాఁబోలు శ్రీ శ్రీ జయపు రాధీశ్వరులు దానికిఁ గృతి పతు లయిరి. ప్రస్తుత పరివర్తనము

## మొయిలు రాయబారము [1]

శ్రీ పిచ్చయ్య శాస్త్రిగారు కయికొన్న స్వాతంత్ర్య మును బరిభావించి యంత కింక నెంతో సంతనగా దీర్ఘ

---

1 మేఘసందేశ మని, మేఘదూత మని, సంస్కృత గ్రంథమునకుఁ బేళ్లు. అందలి 'దూత' 'సందేశ' పదములకు 'రాయబారము' సరిపడునా

సమాస దూరాన్వయాది క్లేశములు తొలఁగఁ ద్రోసి కొని వెలసినది. మఱియు నిది యల్లనల్లన విరియుచు వల్పులు గొల్పుచు నమృత బిందు లొలుకు నలరు రేకులఁ బోలె సులలితము లై జిలుజిలు మనఁ జలువలఁ జల్లుచుఁ జవులఁ జిందుచు విందులు గొలుపుచు నున్న పలుకుల పొలుపుతో మురిపపు టొయ్యారపు టూపుఁ దోపించు శయ్యతో దేసి తెలుఁగు తీరునఁ గడుఁ దియ్య మయిన పాట సొరుతో నిక నిట్లు తెలిఁగించు టన్యుల కసాధ్య మనఁ దగిన ట్లున్నది. పాఠక హృదయముల నీ రచన వల వైచి తివిచి నట్లు వశము గావించుకొను చున్నది. సం స్కృత రచనలఁ గల వ్యంగ్య వైభవ మెల్ల నిందు మిక్కిలి చక్కఁగాఁ జవిగొనఁ దగి నట్లు సంరక్షిత మయినది. ఇం తకు ముం దాంధ్ర కవీశ్వరు లనేకులు • బహు సమర్థులే

---

యని సందేహించితిని. ఆసంస్కృత పదముల కంతకంటెఁ జక్కనిపద మిం కొక్కటి తెలుఁగునఁ గాన రాలేదు. ఇట్టి శృంగార సందేశమునే శ్రీనాథుఁడు 'రాయ బార' మని పేర్కొనెను.

చూ. శృంగార నైషధము, ఆ. 4 ప. 95.

'ఉన్నాదులు సంఘటింపఁగ సమర్థులె యెందును రాయబార ముల్.'

తెలిఁగించినను నా యన్నింటికంటె నీ మొయిలు రాయబారము గుణోత్కర్షము గల దనుట నిర్వివాద విషయము. అందఱ తెల్గునేఁతలు నిందుకు లోఁగిపోవుటకుఁ బ్రస్తుత కవికిఁ దెలుఁగుఁ బలుకుఁ బోలఁతిని నాలుకపై వలసినట్లెల్ల నాట్యమాడింపఁగల మెలపును, దెలుఁగు నాఁట నేఁడు విలసిల్లుచున్న దేశి రచనా పరిణామముఁ జక్కఁ దిలకించి దిద్ది తీర్పఁగల నేర్పును, అసాధారణ మగు రసార్ద్ర హృదయతయుఁ బ్రధాన కారణములు.

## దేశి రచన.

తెల్గు బాసకు దేశి యగు ఛందో రచన నన్న యాదుల నాఁట నుండియు నంతగాఁ బ్రాముఖ్యముఁ బడయదయ్యెను. ఈనడుమనే యది పరిపోషణముఁ బడయ సాగినది. ఈవిషయ మెల్లఁ బ్రపంచించుట కిది చోటు గాదు. శ్రీ ప్రసాద రావుగారు మందాక్రాంతా వృత్తములలో నున్న సంస్కృత గ్రంథమును దెలుఁగున దానికిఁ జేరికగాఁ జెప్పఁదగిన దేశి చ్ఛందో భేదములతోఁ దెలిఁగించిరి. అవి సీస, ద్విపద, తరువోజ, రగడ, రచనల కంది పొంది యున్నవి. మూలము ప్రతిపద చమత్కార భరిత

మయిన కాళిదాసు కృతి యగుట, పరివర్తనము రససిద్ధుని
రచన మగుట, ఛందము దేసి యగుట, యీ తెలుగు కృతి
కింత పొలుపు గూర్చినవి.

సీసపద్య ప్రథమ దళ సమాన గతితో నైదు మా
త్రల గణములు గలిగి, మందాక్రాంతా ఛాయ గల పద్య
ముగాను, సీసచ్ఛాయ గల పద్యముగాను, ఖండగతి-
ఝంపె-చాపు-తాళములలోఁ బదములుగాను, అధ్యాత్మ
రామాయణకీర్తనము, గజేంద్ర మోక్ష కీర్తనము (రాజేం
ద్ర విను సుధా రాశిఁ ద్రి-కూటాద్రి-ఇత్యాదికము)ల
మట్టునను, హృద్యముగాఁ జదువఁ దగి యున్నది.

ఛంద మిందు మాత్రా గణ ఘటితము గాన గురు
లఘ్వక్షర పరివర్త నానుకూల్యము, యతి ప్రాసాన్యతర
సంధాన సౌకర్యము, అలల వంటి పెద్ద పెద్ద చరణముల
యూపుటొయ్యారము, సమకూరి కవికిఁ బరివర్తనమున
స్వైర విహార సౌఖ్యము నొసఁగినవి. రచనము లిట్టివి మన
తెలుఁగునఁ బ్రాంత కాలపు యక్ష గానములలోఁ గాన
నగును. కందుకూరి రుద్ర కవి రచించిన సుగ్రీవ విజయ
మునఁ బదముల నిందుకుఁ దార్కాణగాఁ జూడఁ దగును.

కాని వానిలోని దేశి రచన లీకృతిలోని రచనల వలె నిగ్గులు దేరినవి గావు.

## ఇది యక్ష గాన మే

యక్షులు (జక్కులు) కథా పాత్ర వేషములు గొని నృత్య గేయాత్మకముగాఁ బ్రదర్శించు దృశ్య రచనమునకు యక్ష గాన మని పేరు. తొలుత నవి శ్రీశైలాహోబల పర్వతాదు లందుఁ బ్రదర్శితము లగు చుండెడివి. ఇదియు నేక పాత్ర ప్రయోజ్యము, దృశ్య రూపకమే. ఇదియు నృత్య గానాభిన యానుగుణ మగు రచనా చమత్కృతి గలది యే. ఇందు యక్షుఁడే కథా నాయకుఁ డగుట మఱియు విశేషము. ప్రధాన గ్రంథ మెల్ల గేయాంత్మక ముగా నున్నను గ్రంథ కర్త కడు నేర్పుతో మూాల మందలి గ్రంథారంభ శ్లోకముల నైదింటిని చూాళిక గాను, నాయకుని స్వాగత సంభాషణము గాను బరివర్తిం చుటచేతను గ్రంథాంతమునఁ గూడ సంస్కృతమున దొరకు చున్న ప్రక్షిప్త శ్లోకములకు సరస సంగతి గల్గు నట్లు మంగళాంతత యేర్పడు నట్లును, కథా చమత్కృ తిని గల్పించుటచేతను వర్ణనైకాత్మక మయిన కాళిదాసుని

మేఘ సందేశమున కీ మొయిలు రాయబారమున గా నాభినయ చమత్కార సమంచిత మయిన దృశ్య రూపకత సమకూడినది.

## మ కు ట ము లు

గ్రంథ కర్త తన గేయ రూప పరివర్తనములకుఁ బెక్కింటికి మకుటములఁ గూర్చెను. అవి కొన్ని సరిగా మూలమునకుఁ బరివర్తనములు. కొన్ని మూలానుగుణము లగు కల్పనా విశేషములు. పూర్వార్ధమున కెల్ల నన్వితమగు మకుటము (పల్లవి) చాలఁ జమత్కృతి గలది.

"క్రొమ్మెఱపు వగలాఁడి కూర్మి సంగడికాఁడ !
క్రొమ్మొయిలు తేడ! గయికొమ్ము నావిన్నపము;
నెమ్మి.............
...............సారస్యము గలాఁడ!"

పలుకు పొంక (సౌశబ్ద్యము) మిందుఁ గులుకు లాడు చున్నది. కాళిదాసుని వ్యంగ్య గౌరవ మిందు గడలుకొన్నది. క్రొమ్మెఱపు వగలాఁడికిం గూర్మి సంగడీఁడవయి కూడి వినోదించు చుంటివి గాన నీవే నా నెయ్యురాలి యెడఁబాటువగపును గుఱుతింపఁ గల్గుదువు. జీవన

మిచ్చి సర్వ లోకమును దేల్చు సారస్యము నీ కున్నది. కావున నా విన్నప మాలింపను బాలింపను గల్గుదువు. అని యిందు ధ్వని. ఇట్టి ధ్వని చమత్కృతి కాళిదాసుని కృతిలోఁ బిక్కటిల్లి యున్నది.

శ్రీ వేంకటరాయ శాస్త్రులవారు తమ యాంధ్ర వ్యాఖ్యానమునఁ బద ప్రయోజన మను పేర నిట్టి వ్యంగ్య చమత్కృతులఁ జాల వివరించి యున్నారు. శ్రీ ప్రసాద రావుగా రా వ్యం గ్యార్థముల కెందును భంగము గల్గని యట్లు, అంతే కాక పరిపోషణము గల్గు నట్లు, తమ తెలుఁగు నేత వెలయించిరి. అట్టి పట్టు లనేకములు వివరించి తెలుపఁ దగినవే యయినను విస్తర భీతిని విడుచుచున్నాను. పూర్వ మేఘమునఁ దొలి నైదు శ్లోకములుం బోను గడమ యెల్ల నలకా మూర్గ వర్ణ నాత్మకములే కాన యన్ని పాటలకు నిదియే పల్లవి యై యుల్లాసము గొల్పుచున్నది. పాట పాటకును నీ పల్లవి యనుగత మై యాశ్లోకార్థము మేఘునిఁ గూర్చి య ప్తోక్తి యగుటను స్మరింపఁ జేయు చున్నది. ఉత్తరార్థమున—"కలిమిచెలి కాఁపురము మా యలకా పురము......" ఇత్యాదికము కవి కల్పితము. అలకా పుర వర్ణ నాత్మకము లగు పండ్రెండు శ్లోకములకు

నీ మకుటము పసుపడి యున్నది. యక్షుఁడు తన యింటి పట్టు నానవాళ్లు చెప్పు శ్లోకము లేదు నాకు మేఘ సందేశ మునఁ గడు వేడుక గూర్చుచుండును. తెలుఁగు సేఁత లలిత లలితముగా నున్నను నీశ్లోకములు గూడ దేశి గేయ రూపముగానే యుండఁ దగిన వనుకొనుచున్నాను. యక్షీ స్వరూప వర్ణనాత్మకము లగు రెండు పద్యములును శ్రీనాథుని సూర్య శతక శ్లో కాంధ్రీకరణములఁ దలపించుచు మనోజ్ఞములు గా నున్నవి.[1] వీని తెలుఁగు సేఁత తీరు కవి శేఖర శ్రీ వడ్డాది సుబ్బారాయ కవి కృత్యుపజ్ఞమై శ్రీ పిచ్చయ శాస్త్రి రచనమునఁ దెలుఁగుఁ బొలుపున విరివిసెంది, విందుగొల్పి యిందు గేయతం బడసి కడుం గడు విందు గూర్చుచున్నది.

యక్షుని సందేశము శ్రోత్ర పేయ మైన దని "సందేశం మే........శ్రోష్యసి శ్రోత్ర పేయమ్" పూ. మే. శ్లో. 13 న. య క్షో క్తి రూపమునఁ గాళిదాసు చెప్పెను.

---

1 చూ. శాత శ్యామలతాయూగ పరశు రివ ... సూర్య శతకము చిఱుసానఁ బట్టించి చికిలిసేయించిన గంద్ర గొడ్డలి......

(కాశీ ఖండము.)

ఉత్తరమేఘమున నా సందేశము 10 శ్లోకములలో నున్నది. అందు "శ్యామాస్వంగం..." అను శ్లోకము మొదలు 6 శ్లోకములలో యక్షుని విరహావస్థయు, "న త్వాత్మానం" అను శ్లోకము మొదలు 4 శ్లోకములలో నిరాశచేఁ బ్రాణములు గోల్పోవల దని యక్షీ నోదార్చుటయుఁ గలవు. మొదటి 6 శ్లోకములకు "జీవితేశ్వరి! నిన్నుఁ బాసియు......వినఁగదే" అను మకుటమును, కడమ 4 శ్లోకములకు, "తెగువ సేయకు మాస తెగఁ గోసికొని.........మన్నింపుమా" అను మకుటమును విషయానుగుణముగా సందర్భోచితముగా 7 మాత్రలును 5 మాత్రలును గల గణముల గీతికలలో శ్రీప్రసాదరావుగారు కల్పించిరి. ఆ సందేశ మందలి 'శ్రోత్రపేయ' త శ్రీప్రసాదరావుగారి తెలుఁగుసేఁతలో మూలాధిక మై మురిపించుచున్నది.

## ఇది ప్రయోగార్హము.

రస భావ మయ మయినకథార్థము, అభినయ నాట్య గానానుకూల్యముతో నంద చందము లొదవిన పద బంధమును గల యీ గేయ రూపకము రసిక విద్వ

త్సామాజిక సముఖమునఁ బ్రయోగమును బడయఁ దగి యున్నది. సామాన్య జనులు సామాజికు లగుచో దీని ప్రయోగ సౌభాగ్యము ననుభవింపఁ జాలరు.

## కృత్యాది రచనలు.

శ్రీ సూర్య ప్రసాదరావుగారు రచించిన పద్యములు 'పెంపుడు బిడ్డ' యన్నవి సుమనో మనోజ్ఞములు. 1, 4, 5, 13, 17, పద్యములు చదువుటలో నా తలఁపులు పులకరించినవి. శ్రీ సాహిత్య సమ్రాజులు శ్రీ శ్రీ శ్రీ విక్రమ దేవ వర్మ మహారాజులుంగారి దత్త పుత్రికా కళ్యాణ పద్యములు కవితా రచన మయ్యుఁ గవి కల్పన గాక నిక్కపుఁ బల్కుఁ జక్కందనముతో నిగ్గులు దేరి యున్నవి. కాళిదా సాశ్రయ మగు విక్రమ నామమునకు నాంధ్ర కాళిదా సాశ్రయ మగు విక్రమ నామమునకు నైక్యమును, గృతి కన్యను బెంచుకొని రామార్పణము గావించుటలో విక్రమ భూపునకు జనక సమానతయు నందముగాఁ బొందుపడినవి. వీని యన్వర్థతలో నేదో యాచితి యనభివ్యక్తమై స్ఫురించు చున్నట్లున్నది. శ్రీ సూర్యప్రసాదరావుగారి తండ్రిగారు శ్రీ తమ్మయరాట్క-

వీంద్రులు శ్రీ ముక్కవిల్లి సాంబయ శాస్త్రిగారను విద్వత్కవివర్యుల నాస్థాన కవిని గాఁ గొని పోషించిరి. ఇట్లు విద్వత్పోషకతను బడసి భూనేత యై వెలయు శ్రీ ప్రసాదరావుగారిని గౌర వాస్థాన కవినిగాఁ బరిగ్రహించుటచే శ్రీ విక్రమ దేవ వర్మ మహారాజులుంగారికి సాహిత్య సమ్రాడ్బిరుదము సార్థక మయినది.

నేఁటి యాంధ్ర కవీశ్వరులలో నుత్తమోత్తముల నేఁటి వ్రేళ్లపై లెక్కింపఁ బూనుచో శ్రీ సూర్య ప్రసాద రాయ కవి గారందుఁ గుడి చేతి వ్రేళ్ల లెక్కలోనే కుదురొక్కనఁ గలరు. నిస్సామాన్యముగాఁ గాళిదాస కృతులఁ దెలిఁగించుటచే వా 'రాంధ్ర కాళిదా' సనఁ బరగిరి. ఈ బిరుదము 'అభినవదండి,' 'ఆంధ్ర వాల్మీకి' ఇత్యాది బిరుదములఁ బోలిన దగుటలో స్వారస్యము లేదు. సంస్కృత వాఙ్మయమున వాల్మీకి, కాళిదాసు దివ్య కావ్యముల రచించి పేర్వెలసిరి. సంస్కృత వాఙ్మయమున వారి కెట్టి స్థానము గలదో యట్టి స్థానము నాంధ్ర వాఙ్మయమున నాక్రమించిన వారికే న్యాయ్యముగా నా బిరుదములు చెల్లఁదగినవి. శ్రీ ప్రసాదరావుగారు స్వయముగా నపూర్వకల్ప

నలతో నట్టి కృతుల రచింపను, గాళిదాసు నంత గౌర
వము గడింపను నర్హులే యగుదు రని నా నమ్మకము. ఇఁకఁ
బై పరివర్తనములతోపాటు స్వతంత్ర కృతులను గూడఁ
గూర్చి సరి యయిన తీరున నాంధ్ర కాళిదాస బిరుదమును
శ్రీ ప్రసాదరావుగారు, అత్యంత మన్వర్థపఱుచుకొనఁగలరు
గాక !

శ్రీ మహారాజులుంగారి యాస్థాన మం దింతకు
ముందు శ్రీ సెట్టి లక్ష్మీనరసింహము కవిరత్నముగా నుం
డెను. ఆయన లేని కొఱంత మాయు నట్లు శ్రీ ప్రసాద
రావుగారు మరల దొరకుట శ్రీ మహారాజులుంగారి
యదృష్ట విశేషమే. శ్రీ విక్రమ ప్రభులు మఱియు నెన
మండ్రఁ గవిరత్నముల నాస్థానిలోఁ జేర్చుకొనఁ గలరు
గాక !

సరస సత్కవితా విశారదుఁడు సూర్య ప్ర
సాద రాణ్మణి పూర్వ జని కృతామిత పుణ్య
పరిపాకమునఁ గాంచె బహు కావ్య కన్యకల
సురుచిరాలంకార సుందర తరాకార
వరణీయ గుణ వృత్తి వాక్ఛమత్కృతి మతుల

వార లెల్లను భాగ్యవతులే, యయిన నేమి
మురిపంబు పరువంబు ముద్దు ముచ్చటలు నిం
పును సొంపు నధిక మో మొయిలుఁ గన్నియ! నీకె.

ప్రాఁత కాలపు వేష భాష లిప్పటి కావ్య
బాలికల్ మెచ్చ రని పరికించి నీ తండ్రి
స్వాతంత్ర్యమును దొంటి సంప్రదాయముఁ జక్క
సమకూర్చి పద పద్య సంగీత నాట్య రస
చాతురుల్ నేర్ప నిను జనముద్దుగాఁ బెంచె
సభలలో నీ యాట సౌరు పాటల తీరు
ఖ్యాతి కెక్కించె విక్రమ భూపు మెచ్చించెఁ
బ్రీతి నాయన కిచ్చెఁ బెంపకపు బిడ్డగా;

పరమ పురుషునకు రఘుపతికి ని న్నర్పించి
తరియించినారు నీ తండ్రి పెంపుడు తండ్రి
చిర కాల మఖిలాంధ్ర సీమ నలరించుచును
వెలుఁగుమా సుకృతి! యాశీర్వచన మిది నీకు

**ముయిలు మెఱుఁగులు**

సరవి నిఁక నీ వంటి సత్కావ్య కన్యకలు
జనియింత్రు గా కాంధ్ర జగతి సత్కవులకును
దొరలుఁ గావుత నిరంతరము దొంతరలు దొం
తరలుగా సుకృతి సంతతుల కుదోబ్ధమములు.

శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య
విద్యాలయము,
తిరుపతి 1-10-40.

వేటూరి. ప్రభాకరశాస్త్రి.

శ్రీ

రామచంద్రపరబ్రహ్మణే నమః

గురుభ్యో నమః.

# పెంపుడు బిడ్డ

అన్వయం పావితుం భానో ర్నిమే ర్లోకాన్ కవే ర్వచః,
అవతారో యయోః పృథ్వ్యాం దంపతీ తౌ భజా మ్యహామ్.

## గురుస్మృతి

అమర కీర్తిఁ దమ్మయ మహాకవీంద్రుని
జనక నిభుని నాదు జనకుఁ దెలుతు
వేద మూర్తి ముక్కవిల్లి సాంబయ శాస్త్రి
గురు సమాను నాదు గురునిఁ గొలుతు.

మునుపు గురుల కడన్ 'సరాజ్యము'
మొదలు వెట్టిన నాఁట నుండియు
ననుదినమ్మును జదువు శ్లోకముఁ
దెనుఁగు సేయుచు నుండు నప్పుడు
తనదు పోకడ లెడఁద నాటుచుఁ
దన్మయత్వము నలవరించిన
ఘనుని మత్కవితా కళాగురుఁ
గాళిదాసునిఁ గొల్చెదన్.

## పెంపుడు బిడ్డ

**1**

కమ్రానేక కళా రసజ్ఞ! బుధలో
క స్తోత్ర పాత్రా! కవీం
ద్రామ్రక్ష్మాజ వనీ వసంత! బహు భా
షారాధన ప్రక్రియా
నమ్ర స్వాంత! మనోజ్ఞ కావ్య రచనా
నంద స్మతీ! సాహితీ
సమ్రాట్సద్బిరు దాంక! విక్రమ మహీ
శా! నీకు దీర్ఘాయు వౌ.

**2**

నీ ధర్మ పాలనా నిరతి వెల్లడి సేయుఁ
బూజ్య యౌ జయపురీ రాజ్య లక్ష్మి
నీ మహోదార్య చర్యా మహత్త్వముఁ జాటు
నతులాంధ్ర విశ్వకళాలయమ్ము
నీ విశ్వ వినుత భాషా వైదుషిం దెల్పు
మహిత సాహిత్య సమ్రాట్టు బిరుదు
నీ దయా సత్య శౌచాదులం బ్రకటించు
రాజర్షి సత్ప దార్హ ప్రవృత్తి

బహుళ భవదీయ సుగుణ సంపదల పెంపు
నిండు జాబిల్లి పండు వెన్నెలల నవ్వ
నీ లసత్కీర్తి సతియ వర్ణింప నేర్చు
విబుధ నుతి పాత్ర! విక్రమోర్వీ కళత్ర!

## 3

దేవి భాగవతమ్ముఁ దెలిఁగించి స్థిర యశ
స్తనుఁ డైన కవి లోక చక్రవర్తి
దీనార్థి కవి బుధాధీనార్థుఁ డై లోక
విఖ్యాతిఁ గన్నట్టి విశ్వదాత
పరమ భాగవతుఁ డౌ ప్రహ్లాదునకు సాటి
యగు విష్ణు భక్త లోకాగ్రగామి
ఘన తత్త్వ విదుఁ డైన జనక రాజర్షి కిం
బ్రతి యనం దగు మహా రాజ యోగి
పౌరుష జ్ఞాన కీర్తులం బరఁగు మేటి
యైన నాతండ్రికిని దమ్మయ ప్రభునకు
నఖిల కళ్యాణ గుణ రాశి వైన నీవు
బాల్య మిత్రుండ వగుట మా భాగ్య మధిప!

4

పదియును నాల్గు మాసముల
ప్రాయమునం బితఁ బాయు దుర్దశా
స్పదునకు నాకు ని స్గనెడు
పట్టున భూవర! తండ్రిఁ గన్నచో
నొదవెడు భక్తియుం జనవు
నూఱట గొల్పి తనంతఁ బొంగు నా
హృదయము సాక్షి సూవె పిత
యే పిత నెచ్చెలి యన్న సూక్తికిన్.

5

తనవలెఁ బుత్త్రుఁడున్ సుకవి
తా చణుఁ డైనపు డెంత ప్రీతి గ
ల్గునో కవి యైన తండ్రి కిది
గో! యది నీ మొగ మందుఁ దోఁచెడున్
జనక సమాన! యట్టి పితృ
సమ్మద సంపద నాకుఁ జూపి నన్
దనిపితి గాన నీవు పితృ
దైవమ వంచు నమస్కరించెదన్.

6

అసమానం బగు పుత్త్రవత్సలత న
న్నర్థిం గటాక్షించు నీ
లసమా నాదృతికిం గృతజ్ఞతను దె
ల్పం గోరి నే నియ్యెడన్
దసరా కానుక గాఁగ మా మొయిలుఁ గ
న్యన్ నీకు నర్పింతు నిం
పెసఁగం బెంపుడు బిడ్డగా మనుమరా
లీ బాలఁ గైకోఁగదే.

7

సకల లోకము మెచ్చు సరసతా గరిమచేఁ
గవి కులామోద సంకలన చేత
సరసులకును నింపు సమకూర్చు పెంపుచే
విష్ణుప దాధీన వృత్తి చేత
మెఱుఁగు లీనెడు మేలి మెలఁకువల్ కలిమిచేఁ
దాప మార్చెడు చల్లఁదనము చేత
మిన్నందు విపుల భావౌన్నత్య యుక్తిచే
సుకృతి గీతామృత ప్రకృతిచేత

## పెంపుడు బిడ్డ

నిన్నె పోలిన దీ మొయిల్ కన్నె మిన్న
గొనములం బట్టి యిది నీకుఁ గూఁతు రనుట
కన్నిటం దగి యున్న దట్లగుటఁ జేసి
కూఁతురుగ దీనిఁ గొని పెంచుకోఁ గ దయ్య!

**8**

పువ్వుఁ దేనె సోన లై చెవుల పండువు సేయు
  కలికి పల్కుల ముద్దు లొలుక నేర్పుఁ
బద్దెమ్ములోఁ బాట పాటలోఁ బద్దెమ్ముఁ
  గూడి రా హాయిగాఁ బాడ నేర్పు
నరఁటి పం డొలిచి తా నటు చేత నిడు రీతి
  భా వార్థములఁ దేటపఱుప నేర్పు
గా నాభినయ నాట్య కవితా కళలఁ గూర్చి
  యరు దార నాటకా లాడ నేర్పు
సర్వ గతుల నీకును సంతసమ్ముఁ గూర్పుఁ
గాళిదాస సత్కవి మేఘ కావ్య కల్ప
పుష్ప సౌరభ లహరికా మూర్తి యైన
మా మొయిలుఁ గబ్బపుం గన్నె భామ హేంద్ర!

**9**

పితృ సఖుఁడ వైన నీకు సంప్రీతి నించు
నంచు నిక్ష్వాకు వ్యకన్య నర్పించి నాఁడ
నసుఁగు బిడ్డను దీని రామునకుఁ దక్క
నన్య దైవతములకు నీయకుము తండ్రి !

**10**

మా కబ్బఁపుఁ గన్నియలు త్రి
లోకైకారాధ్య భక్తలోక ప్రియు సీ
తా కాంతు నమజ్జనతా
శ్రీకరునిం దక్క నొరులఁ జేకొనరు సుమీ.

**11**

హృదయ గర్భము నుండి యుదయింపకయ మున్న
శ్రీరామ విభు నే వరించు వ్రతము
నకలంక విమల తారక మంత్ర రాజమ్ము
ననుపదమ్ము జపించు నట్టి దీక్ష
సకల లోకాత్ముఁ డీశ్వరుఁ డన్న దృఢ బుద్ధి
లోకమ్ము సేవించు లోలతయును

బఠిత్ర లోకమున కవ్యయ మహానందాను
　　సంధాన మిదు శక్తి సంపదయును
నపున రావృత్తి పద సుఖావాప్తి నాత్మ
విభునిచేఁ దమ తంద్రి కిప్పించు నెనరు
గలిగి యుందురు మహాకావ్య కన్య లెల్లఁ
గాన నిక్కన్నె జానకీ జాని కిమ్ము.

**12**

జన్న పున్నెల నాఁగటి చాలు గన్న
కన్నె సీతఁ బెంపుడు బిడ్డగా గ్రహించు
జనకు రీతి మా మొయిలుఁ గన్నెను గ్రహించి
ప్రీతి శ్రీరామ విభున కర్పింపు మధిప!

**13**

మహా క్తికముఁగా సువర్ణ మయ
　　మండన యుక్తముఁ జేయు రీతి స
ద్భక్తి ధనంబ కట్నముగఁ
　　దద్రఘు రాముసకుఁగ శుభార్థ వా
గ్రక్తి ఘటించు నిమ్మొయిలుఁ
　　గన్నియ నర్పణ నేసి తత్కృపఁగ

ముక్తిసతీ స్వయంగ్రహణ
మోదసుధాంబుధిఁ దేలవే నృపా!

**14**

అన్యుల్ సత్కవు లెందఱో స్వకృతిక
న్యాదానముల్ సేసి త్వ
న్మాన్యారాధన ధన్యులైరి మనిరి స
మ్యగ్భక్తి శ్రీభర్తకున్
గన్యాదానము సేయఁ దగ్గ కృతిక
న్యన్ నీ సుతం జేసి తా
ధన్యుండౌ టిది నాకు నొక్కనికె కా
దా చెల్లెరా జోత్తమా!

**15**

కూఁతు కొడుకుకు గొడుకుగాఁ గొని యశేష
వితత జయపురి రాజ్య మిచ్చితివి దేవ!
కొడుకు కూఁతుఁ గూఁతురుగాఁగఁ గొంటి విపుడు
దీని కే మీయఁ గల వీవె దీవనలను.

16

అతుల సౌభాగ్య రేఖ నై యలరు నీదు
నను(గు బిడ్డ సువర్ణ రేఖాంబ వోలె
ముద్దు( బెంపుడు బిడ్డ యిమ్మొయిలు( గన్నె
గూడ నీ కూరిమిని జూఱగొనును గాక!

17

విక్రమ ప్రభు ఘోషణా వెలసె నాడు
కాళిదాసుని యమ్మేఘ కావ్య కన్య
విక్రమ ప్రభు కూ(తు రై వెలసె నే(డు
బళిర! మాచిన్ని మొయిలు( గబ్బంపు( గన్నె.

ఇట్లు,

భవ ద్విధేయు(డు,

| జయపురము,<br>ప్రమాథి సం॥<br>విజయదశమి. | **త్రిపురాన వేంకట సూర్య ప్రసాదరావు,**<br>దంతహుండా మాల్కాదారు,<br>సిద్ధాంతము. |
|---|---|

శ్రీ

రామచంద్ర పరబ్రహ్మణే నమః

గురుభ్యో నమః

# దత్తకృతిపుత్త్రికా సమర్పణము

**1**

శ్రీరామ! సూర్య వంశ
క్షీ రాంబుధి పూర్ణ సోమ! శ్రిత జన రక్షా
పారీణ కృపారామా!
తా రాచల నిలయ జపిత తారకనామా!

**2**

చిన్నారి మొయిలుఁ గబ్బపుఁ
గన్నియ నీ కర్పణమ్ము గావించుటకున్
మున్నుగ నా యొనరించెడి
విన్నపముం జిత్తగింప వే రఘురామా!

**3**

మత్స్యఖుం డైన తమ్మయ రాట్కవీంద్రుని
పుత్త్రరూపం బైన పుణ్య ఫలము
సకల భారత మహీ సార్వ భౌమ కుమార
కరదత్త బహుమతుల్ గనిన సుకృతి

## దత్తకృతి పుత్త్రికా సమర్పణము

రఘువంశ ముఖకావ్య రచనా గరిమ 'నాంధ్ర
కాళిదా' సని పేరు గన్న సుకవి
నిత్యమ్ము లోకాత్మ నిను బత్తిఁ గబ్బంపుఁ
బూవులం బూజించు పుణ్యశాలి
రామ! నీ భక్తుఁ డైన సూర్యప్రసాద
రాయ 'కవిభూషణుఁడు' సుధీ రంజకముగఁ
గలికి పాటల నెఱ యాటకత్తె యైన
చిన్ని క్రొమ్మొయిల్ కబ్బంపుఁ గన్నెఁ గనియె.

**4**

కని తొలు దొల్త నిమ్మొయిలుఁ
గన్నియ నాకడకుం దనంతఁ జ
య్యనఁ గొని తెచ్చి "నీ మనుమ
రా లిది 'తాతకు నాదు పాట లా
దిని వినిపించి మెప్పుగొని
దీవన లందెద' నంచు నెంచి వ
చ్చిన" దని తెల్పి చక్క విని
చెఱ్ఱ మదధిష్ఠిత సత్సభా స్థలిన్.

**5**

కాళిదాస సుకవి కవితా కళకుఁ దోడు
గాన కళయు జోడుగా నెలర్పఁ
దెలుఁగుఁ బలుకుబడులఁ దులకించు నాపాట
నిండు సభకుఁ జెవుల పండు వయ్యె.

**6**

మాల మే ఘామృత రసమ్ము జాలువాఱఁ
బలుకుఁ జెలి జోడు పాలిండ్ల పాలు గ్రోల్చి
వింత మెఱుఁగులు పచరించి విందు సలిపె
నీ మొయిలుఁ గన్నియ విశేష మేమి చెప్ప !

**7**

కావ్యగతి మార్పకయ నాటకముగ మార్చి
మేఘమునకు నపూర్వంపు మెఱుఁగుఁ గూర్చి
జక్కు నటునిగఁ జేసి ప్రసాద సుకవి
కట్టు దప్పని స్వాతంత్ర్య గరిమఁ జూపె.

**8**

రఘుకులాధీశ! నీ కృపాశ్రయము కతన
సత్కవితఁ దండ్రికిని బరాజయముఁ గూర్పఁ

జాలు కొడుకయ్యెఁ బో మా ప్రసాదరాయఁ
డంచు లోలో మహానంద మంది నాఁడ.

**9**

మెచ్చును నచ్చెరువుం గొని
ముచ్చట పడు నాకుఁ దనదు మొయిలు సుత నతం
డిచ్చెం బెంపుడు బిడ్డగ
నిచ్చిఱుతం గొమ్మటంచు నెంతయుఁ బ్రీతిన్.

**10**

ఇచ్చి రామవిభు వరించుట మా కావ్య
కన్యకలకు వ్రతము గాన దీని
నల రఘూద్వహునకె యర్పింపఁ దగు నంచు
నతఁడు సెప్పి నాకు నప్పగించె.

**11**

తన పితకుఁ సఖుండ నని
తా ననుఁ దండ్రిగ నెంచు నాతఁ డే
నును సుత నిర్విశేషత మ
నోగతి నాతని గారవింతు మా

## దత్తకృతి పుత్త్రికా సమర్పణము

వినుత పితృక్రమాగత ప
　　విత్ర చిరంతన భూరి సౌహృదం
బనుపధి నైయై విశుద్ధతర
　　మై తిర మై కర ముల్లసిల్లెడున్.

**12**

తనదు తండ్రికిని నాకును గల్గు చిననాఁటి
　　చెలికార మిందు నూల్కొలుపు దలఁపొ
తండ్రి నెచ్చెలి నౌటఁ దనకు నాయెడఁ దోఁచు
　　భక్తి భావముఁ దేటపఱుచు తలఁపొ
తనయందు నాకున్న తనయ వత్సలతకుఁ
　　నెనరీ క్రియం జూపుకొనెడు తలఁపొ
కృతి దాన సుకృత సంగతి గూర్ప స్వకృతి నా
　　చేత నీకర్పింపఁ జేయు తలఁపొ
తెలుపు నిది యౌర! యని మెచ్చి దీని నాదు
కూర్మి పెంపుడు బిడ్డగాఁ గొనుచు నీకు
ముద్దు లొలికెడు నీ చిన్ని మొయిలుఁ గన్నె
నర్పణము చేసితి గ్రహింపు మయ్య! రామ!

## దత్తకృతి పుత్త్రికా సమర్పణము

**13**

రామగిరిని జక్కు రాయబారము వాడె
రామభక్తు సరస రసన నాడె
రామ! నిన్నుఁ గూడె మా మొయిల్ కన్నె యా
ధరణి కన్య వోలె ధన్య గాదె?

**14**

కాళిదాసుని యమ్మేఘ కావ్య కన్య
యమర భాషకుఁ దొడవుగా నలరి నట్లు
మా మొయిలుఁ గన్నె నీకృపా మహిమ వలన
నాంధ్ర భాషా విభూష యై యలరుఁ గాత.

జయపురము,
౨౨-౧౦-౩౮.

ఇట్లు,
భవద్దాసానుదాసుఁడు,
**శ్రీ విక్రమదేవవర్మ.**

శ్రీ

రామచంద్ర పరబ్రహ్మణే నమః.

గురుభ్యో నమః.

# కృతి కన్యకా కృతజ్ఞతాభివందనములు

**1**

శ్రీ విష్ణు పాదాబ్జ చింతా తపస్సక్తి
నతుల రాజ్యాశ్రమ మహర్షియై వర్తించు
శ్రీ సతీ విభు నిభ శ్రీ కృష్ణచంద్ర భూ
పాగ్రణీ సంచిత మహా తపః ఫలమునకు,

ఉత్కళాంధ్రోర్వికిని సత్కీర్తి చంద్రికల
మిన్నందు ముత్యాల మేలుకట్టు రచించు
శ్రీ వాగుమా తుల్య రేఖాంబికా గర్భ
శుక్తి జనితామూల్య ముక్తా ఫలంబునకు,

తన విభుత్వమున నత్యంత పూజ్యతఁ గాంచి
మహనీయ సర్వ సంపదలతో నలరారు



2 **

## కృతి కన్యకా కృతజ్ఞ తాభివందనములు

జయపుర ప్రాజ్య రాజ్య శ్రీని గుణ యుక్తి
రంజించి పాలించు రాజర్షి చంద్రునకు,

అమ రేంద్ర విభ వార్హుఁ డగు మహా రా జయ్యు
నాడంబరం బొకిం తైన లే కనిశంబు
సామాన్య సంసారి చందానఁ జరియించు
పరమ సాత్త్విక భావ భరి తానుభావునకు,

అగు నన్న తన మాట యయ్యె నంటయ కాఁగ
భా వ్యర్థ భూ తార్థ ఫణితు లొక్కటి సేసి
యాఱు నూ ఱైనఁ దా నాడి తప్పని నిత్య
సత్య భాషా హరిశ్చంద్ర రాజేంద్రునకు,

అన్య నృప దుర్లభ మహా వదాన్యత పేర్మి
నాంధ్ర విశ్వ కళాలయమ్ముఁ బ్రోచుచు నాంధ్ర
భారతీ ప్రత్యేక పక్షపాతము సూపు
నాంధ్ర లో కారాధ నాధీన హృదయునకు,

కృతి కర్త యై లసత్కృతి భర్త యై యాంధ్ర
కవితా ప్రియంభావుకత్వమ్ము వహియించి

## కృతి కన్యకా కృతజ్ఞతాభివందనములు

మహిత సాహిత్య సామ్రాజ్య లక్ష్మీ పట్ట
భద్రుఁడై యలరు విద్వత్ప్రభూత్తంసునకు,

భారతోర్వీ సార్వభౌమ ప్రియ కుమార
కర దత్త కనక కంకణ విభూషిత హస్తు
లక్ష్మీ సరస్వతీ లలనా కటాక్ష లీ
లా లసజ్జీవ నోల్లాస ప్రశస్తు స
త్కవితా పటిమ 'నాంధ్ర కాళిదా' సనిపించు
కొన్నట్టి నా కూర్మి కన్న తండ్రిని దనదు
జయపురీ గౌర వాస్థాన కవి గాఁ గొన్న
యభినవాదిమ విక్రమార్క భూపాలునకు,

త్రిపురాన కుల పయోధి నిశీథినీ భర్త
విన తార్తి హర్త దేవీ భాగవత కర్త
మత్పితామహుఁడు తమ్మయ రాట్కవీంద్రుండు
నిజ బాల్య మిత్రముగ నెగడు సన్మిత్రునకు,

తన మిత్రు పుత్త్రు కృతి తనయ నని వత్సలత
మనుమరాలిని నన్ను మన్నించి మేలెంచి
కడఁక ననుఁ దనదు పెంపుడు బిడ్డగాఁ గొనుచు

## కృతి కన్యకా కృతజ్ఞ తాభివందనములు

నా గుణాలంకార నవ మోహ నాంగునకు
నా మనో నాథునకు నా రామచంద్రునకు
నను బత్తి నర్పించి నను ధన్యఁ గావించి
సుకృతి కన్యా దాన సుకృత సంపత్తి మైఁ
దను ధన్యుఁ గావించుకొని యపూర్వ ఖ్యాతిఁ
గొనిన నా పెంపకపు జనకునకు నాయనుఁగుఁ
దాతకును దాతకును భ్రాతకును నేతకును
బూత చారిత్రున కజాత శత్రునకు స
త్కీర్తి కామునకు సత్కృతి కళారామునకు
సుజన బంధువునకును సుగుణ సింధువునకును
నమర నిభునకును విక్రమ దేవ విభునకును,

వందనాల్ వినయ పూర్వ కృతజ్ఞతా వచో
మందార నవ పుష్ప మాలా మరంద ని
ష్యంద తుందిల రస జ్ఞేందిందిరానంద
మందిరాయిత మత్స మభినందనాలు.

**2**

ఆధునిక భోజ రాజైన యా విక్రమో
ర్వీ విభుండు ప్రమాథి విజయ దశమిని దనదు

## కృతి కన్యకా కృతజ్ఞ తాభివందనములు

జయపురము కోటలోఁ జలువ రా కట్టడపుఁ
గొలువు కూటము లోన నలు వారఁ గొలు వుండి
చిన్ని దౌహిత్రుఁ డగు శ్రీ రామ కృష్ణ దే
వాత్మ పార్శ్వ నిషణ్ణుఁ డయి ఆచ్చువడి చూడ
నవ రస జ్ఞుఁడు కమల నాథ రాయలు విప్పఁ
గను చూపు గముల నే తన మెప్పులు వెలార్ప
ధృతి దివాకర మహంతి మ హాశయుని తళ్కుఁ
దెలి చెక్కులను ముదశ్రులు జాలువాఱఁగాఁ
జెలికాని రావు జీ చిఱు నవ్వ తెలి డాలు
నలువు మోమున వింత చెలువమ్ము దొలఁకింప
రసికుఁ డౌ నూతక్కి రామ శేషయ లస
న్ముఖ వికాసము మనో మోదమున్ వెలయింపఁ
దలిసెట్టి రామరా వెలమి మైమఱపొంది
చిత్ర కోవిదుఁ డౌటఁ జిత్ర రూపముఁ దాల్ప
విభు విలేఖకుఁ డైన విశ్వ నాథము మైము
దాశ్చర్య పారవశ్యమ్ము మైఁ బులకింపఁ
గొలువు నందలి తక్కుఁ గల తజ్జ్ఞ జన మెల్ల
మేలు మే లని కదున్ మెచ్చి యాదల లూఁప;
ఆకళా కోవిదుం డాజయపు రీశుండు

## కృతి కన్యకా కృతజ్ఞ తాభివందనములు

నా తండ్రి ముఖమునఁ నాపాట లాలించి
క్రొమ్మెఱుపు వగ లాఁడి కూర్మి సంగడికాని
రాయబారపు వింత రాకడల కెద మెచ్చి
పరమ సమ్మద పూర భరి తాంతరంగుఁ డై
పౌత్రి నగు నను దత్త పుత్రిగాఁ గొను నప్పు
డానాఁటి రాజ సభ యం దుండి నా పాట
లాలించి నను మెచ్చి యరుసమ్ము గొన్నట్టి
యారాజ వంశజుల కాన్ని సోదోగ్యులకు
నాస త్కవీంద్రులకు నాపండి తోత్తముల
కాపౌర జనములకు నాసభ్యులకు నెల్ల
వందనాల్...

### 3

తన తండ్రి యైన సీ తయ గురుని శుశ్రూషఁ
జినాఁడె చిత్ర లేఖన కళం గడిదేటి
ప్రథమ పఠనీయ చిత్ర గ్రంథ కర్త యై
ప్రణుతి కెక్కిన మహోపజ్ఞా సమేతునకు,

అల యజంతా గుహాదుల మాటువడి యున్న
తత భారతీయ చిత్ర కళా పునరున్నత్య

## కృతి కన్యకా కృతజ్ఞ తాభివందనములు

సౌభాగ్య గరిమంబుఁ జాటి చెప్పెడు 'భార
తీయ చిత్ర కళా' ఖ్య మై యొప్పు పాత్తమ్ము
నా గేశ్వ రార్యు నాంధ్ర గ్రంథ మాలకును
వెల లేని రతనంపుఁ గొలికి పూసగఁ జేసి
తెలుఁగు బిడ్డలకు జాతీయ చిత్ర క ళాభి
మానముం గొల్పు విజ్ఞాన సంపన్ను నకు,

నీతి బోధకము లై నెగడు హాస్య వ్యంగ్య
కలిత రేఖా చిత్రముల వ్రాసి పె క్కేండ్లు
బహు గతుల 'భారతీ' పత్త్రికం గై సేసి,
త ద్గత వ్యాస చిత్రము ల టుంచి క డంకఁ
దన త. రా. బొమ్మలనె మున్ను మున్న వెదకికొం
చుబలాటమునఁ గాంచి యుప్పొంగు పాఠకుల
'కీచిత్ర కోవిదుం డెట్టిఁ డో చూతమా'
యనిపించి, సక లాంధ్ర జన హృదయ ఫలకముల
నక్షరంబుగ సువ ర్ణాక్షరంబుల తోడఁ
దన పేరు చిత్రించుకొనిన ప్రతిభా ఖనికి,

నానా విధ విచిత్ర నవ చిత్ర విరచనా
చాతుర్యమునఁ జిత్ర స త్కళా కోవిదుం

## కృతి కన్యకా కృతజ్ఞ తాభివందనములు

డను బిరుదు శ్రీ విక్రమావ నీశ్వర మౌళి
వలనఁ బొందిన కళా కల నాభిరామునకు,

చిత్ర సన్న్యాసముం జేసియుం బ్రభు నాజ్ఞ
ప్రియ మిత్ర బాంధవ ప్రేమకుం దోడు గా
మగుడఁ గుంచియఁ గళా మధుర మోహన భావ
విలసనము లొలయఁ గన్నుల పండువుగ నన్ను
నసమాన రమ్య చిత్రాలంకృతం జేసి
నట్టి నా తండ్రి క ట్టనుఁగుఁ జెలికానికిని
జన వినుత చిత్ర లేఖన కళా నిధికి శ్రీ
తలిసెట్టి కుల కలశ జల నిధి కళా నిధికిఁ
బ్రభు భక్తి విశ్వాస భరిత సద్భావునకు
మహి తానుభావునకు మా రామ రావునకు,

వందనాల్ ...

4

పెద్ద బుఱ్ఱలు గల్గు పెద పెద్ద సభలలోఁ
దన మాటె మీఁదు గా గొనబు యుక్తులఁ బేర్చి
యెద బల్మి నాఁచికొని యెల నవ్వు లొలయించు
మాట కారి తనాన మేటి యౌ గడుసరికి,

## కృతి కన్యకా కృతజ్ఞ తాభివందనములు

ఒకరు పోయిన దారి కొరగ కుండఁ దనంతఁ
గడు స్వాతంత్రత విశృంఖల విహార మొనర్చు
సముదారతర రాజస ప్రకృతి గల్గియును
నీతి నెడ సేయని వినీతి సంపన్నునకు,

కోలారు గనులలోఁ గొను రారు జాళువా
తళుకులకు నెఱె మెఱుంగులు దిద్దు నచ్చంపు
బుద్ధి పెంపున మేలి విద్దెలకు నొడయఁడై
యసము గాంచిన కళా రసికాగ్ర గణ్యునకు,

మరు లేచు గడుసుఁ బడమటి బాస ప్రోయాలి
కులుకుందనపు బెళ్కు మెలఁకువల మరగియును
దల్లి బాస పాలంతి దయకు దవ్వయి పోక
కొలువ నేరిచిన యనుఁగుం దెనుఁగు బిడ్డనికి,

సుకవితా తత్త్వముం జూపి పింగళి వారి
యాఁడు బిడ్డగు కైత పోఁడుములు వెలయించి
యల కళా పూర్ణోదయపు టమృత దీధితుల
మహి వెల్లి గొల్పిన విమర్శక వతంసునకు,

# కృతి కన్యకా కృతజ్ఞ తాభివందనములు

శ్రీ త్రయీ తులిత సుకవి త్రయీ రచిత మై
దయివారు తెలుఁగు లై దవ ప్రాఁ బలుకుఁ బొత్త
మెపుడుఁ బ్రాణముగఁ దా నెంచి పఠియించుకొను
గ్రాంథిక సరస్వతీ కవి తాభిమానికిని,

నాదు ననుగుం దాత నా పెంపకపుఁ దండ్రి
నాదు గురు దేవులకు నాది గురు దేవుఁ డగు
శ్రీ విక్రమ ప్రభుని దీవనలె తనదు దీ
వనలు గా నా కళా వల్లభుని మెప్పు లే
తన మెప్పులుగఁ జెప్పి నను గణ్యుఁ గా నెంచి
'సర్వ విధ నూత్నత్వ' సంపత్తి గుర్తించి
మితము ఋత మాత్మ సమ్మత మగు నిజాశయము
వ్రాసి నాకయి చాల శ్రమ వహించిన యట్టి
యతు లాంధ్ర విశ్వ విద్యాల యోదయ సంప
దభివృద్ధి కారకుం డగు నుపాధ్యక్షునకుఁ
గట్టమంచి సువంశ కల శాంబు నిధి సుధా
కరుఁ డైన రామలింగా రెడ్డి రాయనికి,

వందనాల్...

**5**

ప్రాచ్య లిఖిత గ్రంథ భాండారమున యందు
బహు వత్సరములు దాఁ బండితుం డై యుండి
యన్య దుష్కర మైన యాంధ్ర భాషా సేవ
గావించి విఖ్యాతి గన్న విద్వాంసునకు,

తాటాకు వ్రాఁత పాత్తపుఁ బ్రతుల గాలించి
కవి కృతము లయిన చక్కని పాఠముల నెంచి
సవిమర్శముగఁ బూర్వ కవి కృతులఁ బ్రకటించి
వాసి కెక్కిన యాంధ్ర భాషోపకారికిని,

'కడుపు తీ' పాదిగాఁ గల తియ్య నునుఁ బల్కుఁ
జిన్నారి కబ్బంపుఁ గన్నె మిన్నలఁ గాంచి
తెలుఁగు నాఁటం గలుగు దేశీయపుం గతల
సొగసుఁ గూర్పుల నేర్పు సూపిన కవీంద్రునకు,

లోకజ్ఞుఁ డుభయ భాషా కోవిదుఁడు, బహు
ద్రష్ట, సత్కవి, విమర్శకుఁడు, జాతీయ భా
షా విశేషజ్ఞుండు, సరసుండు నై వెలయు
నేకత్ర దుర్లభానేక గుణ శాలికిని,

## కృతి కన్యకా కృతజ్ఞ తాభివందనములు

వితత యశు లైన తిరుపతి వేంక టేశ్వరుల
ప్రియ శిష్యుఁ డై ప్రాచ్య వి ద్యాలయము నందు
నిపుడు తిరుపతి వేంక టేశ్వరుల సన్నిధిని
గురు పదము గొని యున్న గురు దైవ భక్తునకు,

'మొయిలు మెఱుఁగులఁ' గులుకు మొలక తళతళలకును
దనదు పలుకుల మెలపు తళుకు టద్దము గాఁగఁ
జదువరుల కభిరుచిం బొదలించు సుద్దులన్
ననుఁ బెద్దగ గణించి నాకు దీవన లిడిన
పర సుగుణ పర మాణు పర్వతీకర ణాను
సంధాన చాతురీ సరసతా ధుర్యునకు,
నఖిల విద్వ త్కవి జ నాంబుజ వన ప్రభా
కరుఁ డైన శ్రీ ప్రభాకర శాస్త్రి వర్యునకు,

వందనాల్...

**6**

శ్రీ మ దకలంక గుణ ధామ! శ్రీ రఘురామ!
వినత రక్షక కృ పావేశ! నా హృద యేశ!
పావన భవ త్పంచ మావతారం బైన
త్రైవిక్ర మాఖ్య, తారక మైన నీ రామ

## కృతి కన్యకా కృతజ్ఞ తాభివందనములు

నామమ్ము, నల దశానను ద్రుంచి కడలి దరి
నీ ప్రతిష్ఠించు మానిత రామ లిం గేశు
నభిధ, నీ కుల కర్త యగు ప్రభాకరు పేరుఁ,
దాల్చు పెద్దల నా కృతజ్ఞతకు గుఱి చేసి
సకల విద్వజ్జన స్తవనీయ మై నట్టి
యాత్మీయ సంకలన మమరఁ జేసిన నీ ప
విత్ర సంఘుట నైక పాత్ర చిత్ర చరిత్ర
యిట్టి దట్టి దటంచు నెన్న శక్యమె దేవ!

మా యక్క యగు 'నిందుమతి' యాది గాఁ గల్గు
కబ్బంపుఁ గన్నియల కంటె మున్నుగ నన్ను
లోకాన వెలయించి లోకాత్ముఁ డగు నిన్నుఁ
బరిచరించెడు మహా భాగ్యమ్ము గలిగింప
రాజు కూఁతును మహా రాజు కూఁతును జేసి
సకల విధ నూత్న తర సమలంకృతులఁ గూర్చి
సాహితీ సామ్రాజ్య సార్వభౌముని వలన
నెలమిఁ గన్యా దాన మిప్పించుకొని నన్ను
నేలికొ న్నట్టి నీ లీలా విశేషముల
నాకాశ వాణిచే నఖిల లోకము నందు

## కృతి కన్యకా కృతజ్ఞ తాభివందనములు

నొకటఁ దత గీతికలఁ బ్రకటింపఁ జేసితివి
నామీఁద నీ కెంత ప్రేమ గలదో నాథ!

ఇట్లు నను దయఁ జూచి యేలుకొ న్నట్టి నీ
భక్త రక్షణ కృపా పరతంత్ర లీలలకు,

ఆకాశ గంగ వలె లోక పావని యగుచు
పుట్టఁ బుట్టువు కబ్బపుం బుట్ట వెఱ తేనె
పట్టునం దుట్టి మహిఁ దెట్టువలు గట్టు నీ
భాసమానామల కథా సుధా లహరికిని,

నిరతమ్ము పార్వతీ పరమేశ జపిత మై
యంజనా పుత్త్రునకు నతిలోక శాశ్వత
బ్రహ్మత్వ సిద్ధి సంపాది యై సంసార
నిస్తారకం బైన నీదు నామమ్మునకు,

పరమ పావన యోగి వర హృదయ కుహరముల
దీపించు నవ రత్న దీపికా కళిక లయి
సిల నైనఁ గలికిగాఁ జేయఁగల మహిమమునఁ
బొలుచు కమ్మని దూళి పుష్పాదుల కిమ్ము లగు,

# కృతి కన్యకా కృతజ్ఞ తాభివందనములు

తొలి పలుకు తుది పలుకు తెలనాగ బలఁగంపు
నెఱి కురుల సొమ్ములకు నీ యడుగుఁదమ్ములకు,

వందనాల్ వినయ పూర్వ కృతజ్ఞతా వచో
మందార నవ పుష్ప మాలా మరంద ని
ష్యంద తుందిల రస జ్ఞేందిందిరానంద
మందిరాయిత మ త్సమభినందనాలు.

చెన్నపురి
విక్రమ సం॥ ఆశ్వయుజ
శుద్ధ పాడ్యమి.

ఇట్లు
సుకవి విధేయురాలు,
**మొయిలుఁగన్నియ.**

క. తా.

మఱచిపోయితి నయ్యయ్యో ! యిట మత్కృతజ్ఞతఁ దెల్పు నెడ నే
మఱితి మత్పిత కూర్మి శిష్యుల మాన్యు మా యెలవర్తి రోసయ,
మఱియుఁ బుష్పా లాన్వయున్ గుణ మహితు మా యానంద గజపతి,
గుఱుతు మీఱఁగ ముద్రణ క్రియకుం గడుం గడుఁ దోడుపడియును
నొఱపు వ్రాఁత ప్రతుల్ లిఖించియు నుపకరించిరి వారు, నా యీ
మఱపు మఱచి సహింప వారల మఱి మఱిన్ మది వేఁడెదన్.

మొ. గ.

శ్రీ

రామచంద్ర పరబ్రహ్మణే నమః.

గురుభ్యో నమః

# మొయిలు రాయబారము




(తెరలో)

మరు దగ్ని జల ధూమ
మయ మైన మొయి లేడఁ ?
కరణ పాటవ యుక్తి
గలుగు ప్రాణులచేత
సరగఁ బంపఁగఁ దగ్గ
సందేశము ల వేడఁ ?
దర మౌనె యిది యన్న
తలఁ పేది తహతహా

దరుణికై తనదు వా
ర్తలు గొంచుఁ బోవఁగా
విరహి యొక్కఁడు మబ్బు
వేఁడికొన్నాఁడంట
యరుదు గా దిది చేత
నాచేతనములందుఁ
గరము దీనులు గదా
కామ పీడితులు!

— స్థలము. —

{ రామగిరియందలి యొకానొక సానుప్రదేశము.
విరహాతురుఁడైన యక్షుని ప్రవేశము. }

యక్షుఁడు:—(సవ్యథముగా) అక్కటా! ఎంతకష్ట మెంత కష్టము! ఏమైనదో కదా నాప్రియురాలు?

(చింతించి)

నవనిధి పరిరక్షణము విధి యైన
నవనిధీశ్వరు కొల్వు నా కేల కలిగె?

నువిద నూరార్పఁగా నొక యరగడియ
యొక్కింత సేపు జాగొనరించినంత
జవరాలి నాకూర్మి సకియ నొక్కఁడు
జత వీడి యుండఁగా శపియించినాఁడు
కవ వాసి నోగులు జక్కవ నైతి నకట!
కత్తిపై సాముగా కలవారి కొలువు.

ఏపాటి తప్పు! దాని కింత శిక్షా?

ప్రణయ కుపిత యైన నా చిన్నారి చిలుకలకొలికి నలుకఁ దేర్చుచు, నిధి రక్షణాధికార నిర్వాహణమునకై పోవలసిన వేళ కొక్కింత సే పాలసించితిని. ఎంత పని చేసితిని!

(స్మృతి నభినయించి)

ఆ 'కుటిల కటాక్ష వీక్షణము'లు, ఆ 'కోమల నూత్న కపోల రాగము', ఆ 'చటుల సముంచిత భ్రుకుటి సంవలనంబును, జూచు వేడుక' యే కదా న న్నింత చేసినది!

ఇంతకును నాచేసిన యాలస్య మొక యరగడియయే కదా! అరగడియ తప్పునకు మూఁడు వందల యఱువది రోజులు శిక్షా?

## మొయిలు రాయబారము

రోజులా యివి ? ప్రతిక్షణ మహాయుగములు.

ఏమి శిక్ష ! కఠిన శిక్ష ! అతి కఠిన శిక్ష !

ప్రాణాపాయ కర మైన శిక్ష !

కుమ్ము టగ్గి పుటములో హృదయమును గుతకుతమని యుడికించు శిక్ష !

ఏమి యీ ధన నాయకుల శిక్షాస్మృతి విధాన పద్ధతులు ?

ధనావన విషయమున నియుక్తు లైన యధికారుల నేరమెంత యల్ప మైనను గఠిన శిక్షయే విధింప వలయు నఁట !

అందును నా నేరము ప్రియానిమిత్తక మగుటచేఁ బ్రియా వియోగ రూప మైన శిక్షయే నా కుచిత మైన దఁట !

కోమటిరాచఱికము !

ఔరా ! ఈ కుబేరులకుఁ జతుర్విధ పురుషార్థములలో నర్థమే పరమ పురుషార్థము గదా !

అయ్యో ! రాజరాజా ! నీ వెంత దయా విహీనుఁడ వైతివి ?

నే నపరాధి నే ; నన్ను శిక్షింప వచ్చును. కాని ;

ఆ యనపరాధినికి—ఆ విరహ భీరువునకు— ఆ కుసుమ కోమ లికి—ఆ యబలకు— నిష్కారణముగా శిక్ష విధించి నట్లయి నదే! ఇ దేటి న్యాయము?

ఇంతకును నిన్ననవలసిన పని యేమున్నది?

త్రాఁచుఁ బామును మెడఁ జుట్టుకొన్నట్టు లని యెఱిం గియు నీ ధన రక్షణాధికార వృత్తిని బ్రవేశించుట నాదే తప్పు.

దాననే కదా శాప గ్రస్తుఁడనై నా దైవత మహిమ మస్త మించి నా ప్రేయసి నెడఁబాసి యీ కొండ కోనలలోఁ బడి యుండవలసి వచ్చినది!

(కలయఁ బరికించి చూచి)

ఆహా! ఈరసాధర మెంత పవిత్ర రమణీయముగా నున్నది!

శ్రీరామ పాద రాజీవ రేఖా చిహ్ని
తమ్ములై యలరు నెత్తముల గములు

**మొయిలు రాయబారము**

సీతా మహాదేవి చిఱుబంతి పసుపు నీ
రాడు పావన పంకజాకరములు
పఱపు దట్టపు నీడ పట్లు గల్పించుచుం
జెన్ను మీఱెడు సురపొన్న చెట్లు
ఎండ వేఁడిమి సోఁక కుండఁ జల్వలు నించు
నతి మనోహర గుహాభ్యంతరములు

గలిగి కడుఁ బవిత్రమ్ము లై కనుల విందు
సలుపు నీ రామగిరి వరాశ్రమములందు
నుండు మని పంచి యక్షేశ్వరుండు నాకుఁ
గీడులోఁ గొంత మేలు గల్గించినాఁడు.

శ్రీజానకీ రామ సంచార భాగ్యమునకు నోఁచిన యీ గట్టు రాయని యందు వసించుటచే నా పుట్టువు పరమ పావన మైనది గదా !

(చింతించి)

నా శాప కాలమున నేఁటి కెన్నాళ్లు గడచి యుండునో ?

(లెక్కించుటకై చే యెత్తి)

ఔరా! నా ముంజేతి బంగారు రతనాల కడియము జాఱి పోయినదే! పోనీ;

అయ్యో! నే నెంత చిక్కి పోయితిని!

ఈ యెడఁబాటుఁ గార్చిచ్చులోఁ బడి మలమల మాఁడుచున్న నాకుఁ బ్రాణాలు దక్కుటయే వింత గాని చిక్కి పోవుటాక వింతా?

(వ్రేళ్లపై లెక్కించుట నభినయించి)

కార్తిక శుద్ధైకాదశి నాఁడు నే నిందులకు వచ్చితిని. నేఁడు—
ఆషాఢ శుద్ధ పాడ్యమి;

ఈ యేకాదశి కెనిమిది మాసములు గడచును.

అవురవురా! నే నెంత కఠినాత్ముఁడను!

క్షణకాలము నాప్రేయసి నెడఁబాసి యుండఁజాలని నేను-
ఎంత కాలము గడపితిని!

ఆషాఢము గదా యిది! శ్రావణము దాదా పగుచున్నదే!
కటకటా! ప్రాణేశ్వరీ! కాదంబినీ మేదురాంబర మైన

యీశ్రావణ మాసము నీకు దుస్తరము— అతి దుస్తరము ;
నీ వేమై పోదువో కదా ! ఏమి సేయుదును ?

ఎట్లయినను నా కుశలవార్తను బంపి నా ప్రియురాలి జీవి
తము నిలుపు కొనవలసి యున్నది.

నాఁడు శ్రీరామునకుఁ బావనివోలె నా కట్టి రాయబారి
యెట్లు లభించును ?

(అటు నిటు నడచి చూచి)

ఆహా ! అది యేమి ? ఆ చటియం గోరాడు చున్న కొమ్ము
టేనుఁగా ? కనుల విం దగుచున్న దే !

(నిదానించి చూచి)

కాదు ; కాదు. మేఘము ! మేఘము !

అయ్యో ! మేఘోదయ మైనదే !

{ నివ్వెఱపడి, మొయిలు కట్టెదుర నెట్టకేలకు నిలిచి
కన్నీళ్లు గ్రుక్కికొనుచుఁ జిరకాలము చింతించును. }

అక్కటా! ఈ మేఘమును జూచిన సుఖులకే తహతహ వొడమును గదా! విరహి జనముల మాట చెప్ప వల యునా? ఎట్టి కష్ట కాలము వచ్చినది!

(విరహోన్మాద పరవశుఁడై)

కానీ; ఈ మొయిలు రాయని చేతనే నా జీవితేశ్వరికి మ త్కుశల మయ మైన రాయబార మంపెదఁ గాక!

(కొండమల్లియ క్రొవ్విరులతో మేఘున కర్ఘ్య మొసఁగి)

స్వాగతమ్ము! విరహి జాయా ప్రియానుసం
ధాన చాతురీ నిధాన! నీకు;
స్వాగతమ్ము! దాతృ సార్వభౌమా! నీకు;
జలద వర్య! నీకు స్వాగతమ్ము!

# మొయిలు రాయబారము

(ప్రాంజలియై సరాగ లయాభినయముగా)

క్రొమ్మెఱుపు వగలాఁడి

కూర్మి సంగడి కాఁడ !

క్రొమ్మొయిలు తేఁడ ! గయి

కొమ్ము నా విన్నపము ;

నెమ్మి జీవన మిచ్చి

నిఖిల లోకమ్ములన్

సమ్మోదమునఁ దేల్చు

సారస్యము గలాఁడ !

క్రొమ్మెఱుపు...

# మొయిలు రాయబారము

## 1

భువ నైక విఖ్యాత
    పుష్కలావ ర్తక
ప్రవిమ లాన్వయమందుఁ
    బ్రభవించితివి నీవు
ఆ మహేంద్రునకు నె
    య్యపు బంట వైనావు
కామ రూపుఁడవు లో
    కముఁ దన్ను నెఱదాత
వీ నీ మహాత్మ్య
    మెఱిఁగియే విధి చెద్దు
నే నింతి నెడఁబాసి
    నీ కర్థి నయినాఁడ ;
సఫల మైనను వేఁడఁ
    జన దల్పునిం జేరి
విఫల మైనను ఘనుఁ
    వేఁడు టెంతయు లెస్స.

క్రొమ్మెఱుపు...

## 2

పరితప్తులకు నెల్ల
శరణంబ వగు దీవు
తరుణీ వియోగ సం
తాప తప్తుఁడ నేను
ధననాథు నల్కమై
ద వ్వైన నా కల్కి
కనఘ ! నా సందేశ
మందఁ జేయఁగదయ్య !
వెలి పూవుఁ దోఁటలో
వెలయు క్రొన్నెల తాల్పు
తల నున్న జాబిల్లి
వెలఁది వెన్నెలలచే
నలరు మేడల తోడి
యక్షేశ వాస మా
నలకకుఁ నీ విప్డు
డరుగఁగావలె నన్న !

క్రొమ్మెఱుపు...

**3**

గగనవీథిని నీవు
　　　　గనవచ్చినంతనే
మగలు వచ్చెదరంచు
　　　　మిగుల సంబర మంది
తగిలి పాంథాంగనల్
　　　　సొగసు ముంగురులఁ బై
కెగఁద్రోసికొనుచు ని
　　　　న్నెలమిఁ జూచెద రయ్య !
జలద ! కన్నుల విందు
　　　　సలుపు నీ వేతేర
వలపులాఁడిని బాసి
　　　　నిలుచునా యెవఁడైనఁ,
దల యమ్ముకొని యస్వ
　　　　తంత్ర వృత్తిని జిక్కి
పలవించు నావంటి
　　　　భాగ్యహీనుఁడు దక్క ?

క్రొమ్మెఱుపు...

## 4

జలధరా! మామంచి
　　　శకునమ్ము లివె: గాలి
యలనల్ల ననుకూల
　　　మై నిన్నుఁ బురికొల్పు,
నీ వామ పార్శ్వాన
　　　నిలిచి పెల్లుప్పొంగి
యీ వాన కోయిలయు
　　　నిం పార నెలిఁగించు;
నను వత్సరమును గ
　　　ర్భాధాన సంపత్తి
ననుభవించుచు నున్న
　　　యలవాటుచే, బారు
బారులై, మింటఁ గ
　　　న్పండు వౌ నినుఁ బ్రీతిఁ
జేరి బెగ్గురు లిఁకఁ
　　　సేవింపఁ గల వన్న!

క్రొమ్మెఱుపు...

## 5

మిగులు శాప దినాలు

మొగిని లెక్కిడికొంచు

దిగులుమైఁ బ్రాణాలు

బిగఁ బట్టుకొని మేను

సగ మై బ్రదికి యున్న

సాధ్వి, నీ వదినె, నా

వగలాఁడి నచటఁ ద

ప్పక చూచెదవు నీవు ;

వలపుఁ దేనియకుఁ దా

వల మాట బరు వెక్కి

కలఁగించు నెడఁబాటు

గాలి సోఁకిన యంత

నిల రాలిపోవు చె

ల్వాల జీవితపుఁ బూవు

లలి నాస యన్న తొడిమ

బలిమి నిల్పుఁ గదన్న !

క్రొమ్మెఱపు...

## 6

నేల నేలరఁటులన్

నిండార మొలపించి

చాలఁ బైరులు పండు

జాడలన్ సూచించి

చెవుల పండువు సేయు

చిన్నారి నీ యురుము

రవళి విన్నంత నే

రాయంచ బలఁగమ్ము

మానసమ్మును జేరు

మాన సౌత్సుక్యమ్ముఁ

బూని యా కైలాస

మును జేరు నందాఁకఁ

దమ్మి లేనునుఁ దూండ్ల

దారి బత్తెముఁ గొంచు

నెమ్మిమై విను వీది

నీకుఁ దోడగు నన్న !

క్రొమ్మెఱుపు...

## 7

జనవంద్య రఘురామ
చరణాబ్జ చిహ్నముల్
గను వింధు గొలుపు మే
ఖల లందు ధరియించి
యలరు నున్నతుని నీ
యచలేంద్రు నీ కూర్మి
చెలికానిఁ గౌఁగిటం
జేర్చి వీడ్కొను మయ్య!
కారు కారున నిన్నుఁ
గలసి కొన్నపు డెల్ల
భూరి విరహార్తి మెయిఁ
బొరిఁ బొరిం బొడ తెంచు
వెచ్చ నౌ బాష్పమ్ము
విడుచుచుఁ నీ మీఁది
యచ్చపుం గూర్మి నీ
యద్రిరాజు వెలార్చు.

క్రొమ్మెఱుపు...

**8**

అలపు గొన్నపు డెల్ల
నందందు శ్రమ వాపి
యలరించు విడిది ప
ట్లయిన కొండలు గల్గి
యెడ నెడం గృశియించు
నెడలఁ జుల్కని నీరు
గడుపారఁ గ్రోలఁ జొ
ప్పడిన యేఱులు గల్గి
పైనమ్మునకు నర్హ
మైన చక్కని దారిఁ
బూని నే వినిపింతు
మునుమున్న విను మన్న!
చెవులకుం గడు విందు
సేయు నా సందేశ
మవల నిం పెసలార
నాలింపఁ గల వయ్య!

క్రొమ్మెఱుపు...

## 9

గాలి యీ యద్రి శృం
గముఁ గొంచుఁ జనెడుఁ గాఁ
బోలు నంచును భీతి
ముగ్ధ సిద్ధాంగనల్
వదనముల్ పై కెత్తి
చదల నేగెడు నిన్ను
బెదరుఁ జూపుల శంక
గదురఁ గన్గొను చుండ
సరసైకనిచుల మీా
స్థాన మ్మెడలి త్రోవ
నరిది దిఙ్నాగోరు
హస్తావలేపముల్
దప్పించుకొనుచు ను
త్తరదిశా ముఖముగా
గుప్పునఁ మింటికి నె
గురుమయ్య! జీమూత!
క్రొ మ్మెఱుపు...

## 10

అరిది రత్నాల చా
యల కూడికయుఁ బోలెఁ
గర మింపు నింపుచుం
గనుల పండువు సేయు
హరి చాప ఖండ మ
ల్లదిగో కట్టెదుర నే
పొరిఁ బుట్ట కొన నుండి
పుట్టు చున్న దికంటె
నీలాల జిగి నేలు
నెమ్మేను గల నీవు
చాల వెల్గెదు దీని
సంగతిఁ జలవాహా!
నీలాలకపు మౌళి
నెమిలి పించెముఁ దాల్చి
లీలమై వెలుఁగు గో
పాల కృష్ణుఁడు వోలె.

క్రొమ్మెఱుపు...

## 11

తమ సేద్యమునకు స
త్ఫలదాత వని నిన్నుఁ
బ్రమదమ్ము వెల్లిగొనఁ
బల్లె ముద్దియ లెల్లఁ
గప్పారు నెఱిబొమల
త్రిప్పు లెఱుఁగని ముగుద
విప్పుఁ గను దోయిళుల
ఱెప్ప లార్పక క్రోలఁ
జెలువారు మాల మను
క్షేత్రరాజము నెక్కి
వలపార నట దుక్కి
పద నొదవఁగాఁ గురిసి
మలఁగి యొక్కింత పడ
మర కేగి లఘు గతిం
దల యెత్తి మగుడ ను
త్తరముగాఁ జను మన్న!

క్రొమ్మెఱుపు...

## 12

జడి వానఁ గార్చిచ్చుఁ

జల్లార్చి వన హాని

నుడువుచుం గాపాడు

నుపకారి వని యెంచి

కడు దారి బడలికం

గన్న నీ దల మీఁద

నిడికొంచు గారవిం

చెడు నామ్రకూటాద్రి

చెలికాఁడు తన యండఁ

జేర వచ్చిన నాఁడు

తొలి పొందినట్టి మేల్

దలఁచి యల్పుం డైనఁ

బిలిచి చేకొనుఁ గాని

పెడ మొగం బిడఁ బోఁడు

ఇల నట్టి యున్నతుని

నీకఁ జెప్పఁగా నేల ?

క్రొమ్మెఱుపు...

## 13

నలు వలంకుల యందుఁ
బలుకఁ బొాఱిన పండ్ల
గొలలచేఁ దెలుపారు
కొండ మామిళ్ళు లుండఁ
దల మీఁద జడవోలె
నలుపారు నీ వుండఁ
గెలఁకులం దెలుపు నొ
దల మీఁద నలుపు నై
తనరు నక్కొండ న
ల్లని చూచుకము తోడి
మనుచేడె తెలి గుబ్బ
చను వోలె నవ్వేళ
విను వీది విహరించు
విబుధ దంపతులకుం
గనుల పండువు గాఁగఁ
గనుపట్టెదుం జుమ్మ!

క్రొమ్మెఱుపు...

**14**

వలపారఁ జెంచు జ
　　　వ్వనులు క్రీడలఁ దేలు
నలరు టీరములతో
　　　నలరు నమ్మల యందు
నిలిచి యొక్కింత సే
　　　పల పార్చికొని వేగ
వెలలి వర్షించి య
　　　వ్వలి దారి వడి దాఁటి
పెను అాల విషమ మా
　　　వింధ్య పాదమునందుఁ
బెనఁగు లాడెడు రేవఁ
　　　బ్రీతిఁ జూచెద వయ్య!
ఘన హస్తి మేన రే
　　　కలు రేకలుగఁ దీరి
చిన యట్టి తెలి బూది
　　　సింగారముం బోలె.

క్రొమ్మెఱుపు...

## 15

మును వాంత వృష్టివై
మొనసి యయ్యెడ తిక్త
వన హస్తి మద ఝరీ
వాసిత మ్మయి యొప్పి
నేరేటి యీరాల
నిలిచి పాఱుచు నున్న
యారేవ నీ రాని
యరుగు మయ్య ! పయోద !
చాల నంతస్సార
సము పేతుఁ డగు నిన్ను
గాలియుం గదలింపఁ
గాఁ జాలదు సుమన్న !
కరము రిక్తుం డెందుఁ
గడుఁ జుల్కఁదన మొందుఁ
బరిపూర్ణుఁ డిల గౌర
వమ్ము గాంచుఁ గదయ్య !

క్రొమ్మెఱుపు...

## 16

అపుడ యర మొలక లగు

నకరువులఁ బాలాశ

కపిశ వర్ణము లయిన

కడిమి పూవులఁ దినుచుఁ

దోలు దోలుతఁ గసెములను

మొలచు మొగ్గల తోడ

నలరు నేల యరంటి

పిలకలను గొఱుకుచును

గాలి బీఁటలు వడిన

కానలను బుగులుకొను

నేల నెత్తావులను

నెమ్మి మెయి మూర్కొనుచుఁ

జినచిన్న క్రొమ్మంచుఁ

జినుకులం జినుకు నీ

చను త్రోవ సూచించు

సారంగ యూథమ్ము.

క్రొమ్మెఱుపు..

## 17

వాన చినుకులు క్రిందఁ
బడ కుండ నెడ మ్రింగు
వాన కోయిలల నె
వ్వలను సూచుచు మెచ్చి
బారు బారులుగ నే
ర్పడుచు పె న్వాను దారిఁ
గేరు బెగ్గురుల లె
క్కించి చూపుచు వేడ్క
విహరించు సిద్ధు ల
వ్వేళ నీ వులుమఁగా
సహచరీ మంజుల
స్తన మంజరీ ద త్త
సహసా పరీరంభ
సౌఖ్య సంపద నొంది
రహిని నీ యెడల గా
రవము సూపెద రయ్య!

క్రొమ్మెఱుపు...

## 18

చెలికాఁడ! నాకునై
చెచ్చెరం బోవఁగాఁ
దలఁచి నీ వెంతగాఁ
దత్తరం పడుచున్నఁ
దెలి కన్గొనల ముద
శ్రులు జాలుకొన నెమ్ము
లెలమి స్వాగతపుఁ గే
కల నిన్నెదురుకోఁగఁ
గొండ మల్లియ పూల
క్రొత్తావు లెగఁజిమ్ము
కొండ కొండను నీకుఁ
గొంత జాగగుఁ జుమ్ము
నిండుఁ గూరిమిని నా
నెమిళులర్ వీడ్కొల్పంచు
వెండియుర్ నాకునై
వేగ మేగఁ గదన్న!

క్రొమ్మెఱుపు...

**19**

మొనలు విప్పారు క్రొ
మ్మొగలి పొట్టలఁ దెల్లఁ
దన మూను నుద్యాన
వనుల కంచెలు గల్గి
గ్రామ్య పక్షులు గూండ్లు
గట్టు సందడులచే
రమ్యమ్ము లైనట్టి
రచ్చ మ్రాఁకులు గల్గి
యాపఁ బండిన పండ్ల
నలరి కారొ్కనుచున్న
నేరేళ్లఁ గొన్నాళ్లు
నిలుచు నంచలు గల్గి
జలద! నీ వట సన ద
శార్ణ దేశము వింత
చెలువమ్ము దాల్చి క
న్నుల పండు వగుఁ జుమ్మ!

**20**

పృథివి న ల్దెసలందు
విదిశ నా నెంతయుం
బ్రథిత యా తద్దేశ
రాజధానికిని నీ
వరిగి తోడ్తోడనే
యచటఁ గాముకతకుం
బరిపూర్ణ మైనట్టి
ఫలముఁ బొందుదు వయ్య!
యెలమిఁ దీరము చెంత
నింపార సుఖముచుం
జెలువంపు బొమ ముడిం
జెలఁగు మోముం బోలెఁ
జల దూర్మి రేఖలఁ
సలలితం బయి యొప్పు
నల వేత్రవతి స్వాదు
జలముఁ గ్రోలుదు వన్న!

క్రొమ్మెఱుపు...

## 21

జలద! యా ప్రాంత నీ

చైరాఖ్య గిరి మీఁద

నలపాఱి వసియింపు

మప్పర్వతము నీదు

కలయికం బుష్పించు

కడిమి మ్రాఁకులచేతఁ

బులకించినదివోలెఁ

బొలుపారెడుం జూవె

వెలయాండ్ర రతి కేళి

వలపుల౯ వెదచల్లు

లలిత విపు లోజ్జ్వల శి

లాగృహావళులచే

నలరు నమ్మల నాగ

రుల గాఢ తిమిరంపు

టెల జవ్వనముల పెం

పెఱుఁగఁ జెప్పెడుఁ జుమ్మ.

క్రొమ్మెఱుపు...

**22**

అట సేద దేటి విత
తాటవీ నిమ్న గా
తటములం బొడము ను
ద్యాన వాటికలలోఁ
బొలుపారు నడవి లే
మొల్ల మొగ్గల చాలుఁ
దోలి నీటి చిన్కులం
దొప్పఁ దోఁచుచు సారెఁ
జెందు చెక్కిళ్ల క్రొం
జెమరు వోఁ దుడువఁగాఁ
గంది వాడెడు వీను
గల్వ పూవులతోడ
విలసిల్లు పుష్ప లా
వికల మోముల కందు
బలు చాయ నొసఁగి క్షణ
పరిచితిం గని పొమ్ము.

క్రొమ్మెఱుపు...

## 23

జలవహా! యుత్తరా
శకును బోయెడు నీకు
నల త్రోవ కొంత చు
ట్టైన నయ్యెడుఁ గాని
యిల వాసిగను నుజ్జ
యిని సౌధములయందుఁ
గలసొంపు లరయకే
కడచి పోవకు మయ్య!
తళుకు తళుక్కనఁ దటి
ద్దామములో మెఱయించి
బెళుకారు చూపులం
బెదరు నవ్వీటి నె
చ్చెలుల లోలేక్షణా
శ్రీలతోడం గ్రీడ
సలుప వేనియు నీదు
జన్మంబ దేలన్న!

క్రొమ్మెఱపు...

## 24

అలల సందడులచే
　　　నందంద యెలిఁగించు
పులుఁగు చాలను మేలి
　　　మొలనూలు ధరియించి
సొల పారఁ గడు లోఁతు
　　　సుడి పొక్కిలి వెలార్చి
సులలిత గతి స్ఖలిత
　　　సుభగమ్ముగాఁ దారి
యెలమి నా దారి నీ
　　　కెదు రైన నిర్వింధ్యఁ
గలసి యుజ్జ్వల రసా
　　　కలితుండ వగు మయ్య !
వెలఁది మిన్నలకు స్వ
　　　ప్రియుల పట్టునను నె
వ్వలపుఁ జెయ్యువె తొలిం టి
　　　ప్రణయోక్తులు గ దన్న !

క్రొమ్మెఱుపు...

## 25

అటఁ ద నూదక వేణి
యగు సింధు నది మహా
తటముల౯ విలసిల్లు
తరు సంతతుల నుండి
యెండి పైపై రాలు
పండు టాకుల చేతఁ
బాండు వర్ణము కల్గిఁ
బాలిపోయి త నంతఁ
బ్రభ దక్కి నీ యెడం
బాటు వ్రేటున స్రుక్కి
సుభగ! నీ సౌభాగ్య
విభవంబు వెలయించు
నెటు లయ్యది కృశత్వ
మెడలి యుప్పొంగునో
యటు లీవు గావించు
టది నీకు విధి సూవె.

క్రొమ్మెఱపు...

## 26

ఉదయనుని కత లెటేఁగి
యున్న యా యా యూళ్ల
ముదుసళ్లతోఁడ నా
వ్హా నవంతికిం బోయి
భూ వలయ పుర మణీ
ముకుట మై తగు నల్ల
శ్రీ విశాల విశాలఁ
జేరఁగాఁ బోవయ్య !
బలు పున్నెపు ఫలాల
పస దటేఁగి రస కొటుఁగు
నల వేల్పు వీటి పు
ఙ్యులు పుణ్య శేషంపు
ఫల మనుభవించుటకు
నిలకుఁ దెచ్చిన కాంతి
కలి త్రైక వర నాక
ఖండ మన నది యొప్పు.

క్రొమ్మెఱుపు...

**27**

లలిత విస్ఫుట మదా
కలిత సారస పఙ్క్తి
కల కూజితమ్ములం
గడలఁ జిమ్ముచుఁ జక్క
విరియు నెత్తమ్మి క్రొ
వ్విరుల పుప్పొళ్ల లోఁ
బొరలాడి యాడి తా
వుల బుగులొ్కనుచు నం
దంగానుకూల మై
హరియించు నవ్వేటి
యంగనా మణుల యా
యత ర తాయాసమ్ముఁ
బ్రార్థనా చటు కారుఁ
డగు ప్రియుండును బోలె
నర్థి వేఁబోక శి
ప్రాపగా పవనమ్ము.

క్రొమ్మెఱుపు...

## 28

ఉద్యుక్తి హరియించె
నుదయనుం డిచ్చోటఁ
బ్రద్యోత నృపతనూ
భవను వాసవదత్తఁ
జెన్నారె నిచట నా
క్షితి పాలకుల మాళి
చిన్ని బంగరు తాటి
చెట్ల తోఁపుల కాన
మత్తెక్కి కట్టుఁగం
బముఁ బెల్లగిలఁ జేసి
హత్తి నలగిరి కలఁగి
యచ్చోటఁ జెలరేఁగె
నని చెప్ప చాగంతు
లయి నట్టి చుట్టాల
ననయమ్ముఁ ద దభిజ్ఞు
లలరింతు రవ్వీట.

క్రొమ్మెఱుపు...

## 29

కిటికీల వెలువాఱు
　　　　　కేశ సంస్కార సం
ఘటిత ధూపమ్ములం
　　　　　గాయమ్ము బలు పెక్క
హిత బంధు వని ప్రీతి
　　　　　గృహ మయూర చయమ్ము
ప్రతత లాస్యోపహా
　　　　　రముల నర్పింపఁగా
లలి తాంగనా పాద
　　　　　లాక్షాంకితమ్ము లై
యలరుఁ దావుల నొప్పు
　　　　　హర్మ్య రాజము లందు
నిలిచి తత్పుర లక్ష్మి
　　　　　నెమ్మి మైఁ గనుఁ గొంచు
జలవాహ! యటఁ బధి
　　　　　శ్రమము వీడ్కొను మయ్య!

క్రొమ్మెఱుపు...

**30**

తమ సామి గళకాంతిఁ
దనరు దీ వని యెంచి
ప్రమథు లాదృతి నిన్నుఁ
బరికించి చూడఁగా
జల కేళులం దేలు
జవరాండ్ర నెమ్మేని
కలపమ్ములను మేలి
కలువ పూ పుప్పొళ్ల
వలచు చుండెడు గంధ
వతి మారుతములు పైఁ
బొలసి తూఁగాడు తీఁ
గలతోడి పూఁదోఁట
గల లోక గురు కాళి
కా మనోహరు పుణ్య
నిలయమ్మునకు నందు
నీవు తప్పక పొమ్ము.

క్రొమ్మెఱుపు...

## 31

అతి పూజ్య మగు నమ్మ
　　　　హాకాళమునకు నీ
వితర వేళ నొకప్పు
　　　　డేగి యుండుదు వేని
నినుఁ డస్తశిఖరి మా
　　　　టున కేగు నందాఁకఁ
గనిపెట్టుకొని యుండఁ
　　　　గా వలెం జు మ్మయ్య!
యటఁ జండికేశ సం
　　　　ధ్యార్చనా మహనీయ
పటహ వాద్య క్రియం
　　　　బచరించుచును నీదు
శ్రీక రామంద్ర గ
　　　　ర్జిత విరావములకుం
బ్రాకట మ్మగు మహా
　　　　ఫల మొందఁ గల వన్న!

క్రొమ్మెఱుపు...

**32**

లలిత పాద న్యాస
　　　　ముల మేఖలలు మ్రోయ
లలి వీచు తెలి చామ
　　　　రల పిడులపై హస్త
వల యాగ్ర మణి కాంతు
　　　　లోలయఁగా భవు మ్రోల
నెలమి నాడుచును జే
　　　　రలఁత మై వసివాడు
వెలయాంద్రు గోటి గం
　　　　టుల కింపు నింపు నీ
తొలి నీటి చిన్కులం
　　　　దోఁగి ని న్నెద మెచ్చి
నిలు వెల్ల నీ మీఁద
　　　　నిగిడింతురు సుమయ్య!
యళి మాలి కాయత క
　　　　టాక్ష మాలిక లందు.

క్రొమ్మెఱుపు...

**33**

అట మహా నటు తాండ
వారంభ వేళ వి
స్ఫుటి తాభినవ జపా
పుష్ప సన్నిభ మైన
కడ సంజ కెంజాయఁ
గలయంగ ధరియించి
పొడ వైన భుజ వనం
బును జుట్టుకొని యుండి
భయ మేది గట్టు రా
పట్టి నిశ్చల శాంత
నయన నై నీ బత్తి
నలి మెచ్చి చూడఁగా
నచ్చోటఁ దీర్పుము గ
జాసుర ద్వేషికిం
బచ్చి యేనిక తోలు
పైని గల్గెడు కోర్కె.

క్రొమ్మెఱుపు...

**34**

ననవిల్తు కోల్తలట్టె
నడిరే ప్రియుల యిండ్ల
కనురక్తిఁ జను చుండు
నభిసారికల కందుఁ
దను సూచి భేదింపఁ
దగు చిమ్మ చీఁకట్లఁ
గను చూపు గముల నరి
కట్టు రాదారిలోఁ
గనకంపు నికష రే
ఖలకు జో కయి వీఁకఁ
దనరు క్రొమ్మెఱపులం
దారిఁ జూపఁగ దయ్య !
పెను వాన నుఱుములట్టె
బెదరింపఁ బోకుమీ
యనుఁగు నెచ్చెలి ! వార
లతి భీరువులు సుమ్మ.

క్రొమ్మెఱపు...

**35**

మెఱసి మెఱసియుఁ జొక్క
మెయి నక్కపయి వ్రాలు
మెఱుఁగు టిల్లాలితో
మేఘు! యారే యెల్లఁ
దవిలి కూర్కెడు కపో
తముల కి మ్మగు నొక్క
భవనమ్ము పైకప్పు
పయి నిమ్ములం బుచ్చి
యరుణుండు తొలి దిక్క
నందుఁ దోఁచిన యంత
మరల సత్వర గతిం
బైన మై పోవయ్య!
మొనసి మిత్రుల కార్య
ములఁ దీర్ప దొరఁకొన్న
ఘనులు జాగొనరింపఁ
గాఁ జాలరు సుమన్న!

క్రొమ్మెఱుపు...

## 36

అలుగు ఖండిత నాయి

కల కన్నుఁ గొలుకులం

దొలఁకాడు కన్నీరు

దుడిచి వల్లభులు నె

వ్వాల పార నోదార్ప

వలతు రత్తఱిఁ గాన

జల జాప్తు సృతి కడ్డు

సనకుమీ జలవాహ !

నలిని రాజీ వాన

నము నుండి ముత్తెంపుఁ

దెలి మంచుఁ గన్నీరు

దొలఁగింప ననురక్తి

యెలరారఁ దోఁచు న

య్యీను కరమ్ముల కడ్డు

గలిగింప నాతండు

కర మల్గెడుం జుమ్మ.

క్రొమ్మెఱుపు...

## 37

అవల గంభీ రాఖ్య

నలరారు నొక యేఱు

దవులు నీ దారిలో

దాని తేటగు నీటఁ

దగ వినిర్మల హృదం

తరమునం బోలె నీ

సొగసు నీడయు నైనఁ

జొరక తప్పదు గానఁ

దెలి కల్వ పూల తే

కుల సొంపు నింపుచుం

దళుకు తళుక్కనఁ బైకి

దాఁటు బేడిస మీల

బెళుకుఁ జూపుల నిన్నుఁ

బ్రీతిఁ జూచెడు దాని

వలపు దిట్టతనాన

వమ్ము సేయకు మయ్య!

క్రొమ్మెఱుపు...

## 38

దరిపిఱుఁ దెడలి జాఱఁ
దన కేల నొక్కింత
పొరిఁ బట్టుకొని యున్న
కరణిఁ బ్రబ్బలి కొమ్మ
నొరసి యున్నట్టి త
ద్వర వినీ లోదకాం
బరముఁ హరించి పై
పై వ్రేలి తూఁగాడు
సర సాగ్ర ణికి నీకు
సఖుఁడ! పైనమ్ము దు
ష్కరముగా నత్తఱిం
గనుపట్టెడుం జూవె
చవి యెఱింగిన యట్టి
సరసుఁ డెవ్వం డైన
వివృ తోరు జఘనఁ దా
విడిచి పోవఁ గలాఁడె?

క్రొమ్మెఱుపు...

**39**

నీ వానలం దోఁగు
నేలఁ బె ల్లుబుకు నె
త్తావులం గొని ఘ్రాణ
తర్పణ మ్మయి యొప్పి
నిజ నాసికా రంధ్ర
నినద రమ్యమ్ముగా
గజ బృంద మెగఁ బీల్పఁ
గా మంద మంద మై
యడవి మేడుల నెల్ల
నారఁ బండించుచుం
గడు నింపు నింపు చుం
డెడు శీత లానిలం
బల దేవగిరిఁ జేర
నరుగు చుండెడు నీకు
నలపు దీఱఁగ నప్పు
డల్ల నల్లన వీచు.

క్రొమ్మెఱుపు...

## 40

నిరతమ్ము నా దేవ
గిరి మీఁద నివసించు
పురహా రాత్మజు శ క్తి
ధరునిఁ బూ మొగుల వై
కొలిచి మందాకినీ
జల కణార్ద్రమ్ము లా
నలరు సోనలఁ దాన
మాడింపఁ గద వయ్య!
భువ నైక హిత బుద్ధిఁ
బురహూత వాహినీ
నివహా రక్షార్థ మై
నిటల లోచనుఁ డగ్ని
మొగము నం దిడి నట్టి
యగణి తాత్యాదిత్య
మగు తేజమే చుమీ
యమ్మహా పురుషుండు.

క్రొమ్మెఱుపు...

**41**

పలు వన్నె జోతిరే
        కల చుట్లతోఁ గూడి
పొలుపారు నే నెమిలి
        పురి కన్ను ప ట్టూడి
యిల రాలఁ గొడుకుపైఁ
        గల ప్రేముడిని దానిఁ
గలువ తే కిడు చెవిం
        గయిసేయు నా గౌరి
నెల తాల్పు శిరసు వె
        న్నెలలచే నెంతయుం
దెలుపారు కన్నుఁ గొ
        ల్కులతోడి గుహుని య
ప్పొలుఁగుఁ దత్తడి నవల
        మల గవుల మఱు మ్రోఁత
లలమ బిట్టుఱిమి గొం
        డిలికిఁ దార్పఁగ దన్న !

క్రొమ్మెఱుపు...

**42**

శర సూతి నటు గొల్చి
జల బిందువుల చేతఁ
గరము వీణియల తీఁ
గలు నాను నను భీతిఁ
బొరసి సిద్ధ ద్వంద్వ
ములు నీకు నెడ గాఁగఁ
ద్వరఁ దొలంగఁగ వారి
ధర ! కొంత ద వ్వేగి
వహా దాపగా మూ_ర్తి
వర రంతి దేవేశ
బహుళ గ వాలంభ సం
భవ వినిర్మల కీ_ర్తి
రహిని నొప్పారు చ
ర్మణ్వతీ నది నెదఁ
బహుమతించుచు దాని
పైని వ్రేలఁ గదయ్య !

క్రొమ్మెఱపు...

## 43

అల కృష్ణు మై చాయ
నపహరించెడు నీవు
జలములం గ్రోలు ని
చ్చను దానిపై వ్రాల
వితత మయ్యును దూర
విలసిత మ్మగుటచే
నతి సూక్ష్మ గతిఁ దోఁచు
నయ్యేటి పెను వెల్లి
దిగువఁ గ్రిఁ జూడ్కులం
దిలకించు చున్నట్టి
గగన చారుల కందుఁ
గనుపట్టెడుం జూవె
నెర వైన మ ధ్యేంద్ర
నీల రత్నము తోడి
ధర యొంటి పేట ము
త్యాల హారము వోలె.

క్రొమ్మెఱుపు...

**44**

జలద! యన్నది దాఁటి
చనఁ జనన్ దారిలో
విలసిత భ్రూలతా
విభ్రమమ్ములు మీఱ
నలుపు మించెడు తళ
త్తళ లీను తెలి కాంతు
లెలరారఁగా మింటి
కెగఁ జిమ్మి నట్టి మొ
ల్లల వెంట నంటు తేఁ
టుల సొంపు గికురించు
తళుకుఁ జూపుల నల్ల
దశపురీ లలనా మ
ణులు వేడ్కఁ దఱచుఁ దొం
గలి తెప్ప లెత్తి క
న్నుల పండు వగు నిన్నుఁ
దిలకింతురు సుమయ్య!

క్రొమ్మెఱుపు...

**45**

అవల బ్రహ్మావర్త
మను దేశమును నీదు
నవిరళం బైన ఛా
యా మాత్రమునఁ జొచ్చి
క్షత్ర సంగ్రామ సూ
చక మైన యా కురు
క్షేత్ర రాజము నటం
జేరఁగాఁ బోవయ్య!
భండనమ్మున నందు
గాండీవ నిర్ముక్త
చండ కాండముల నా
గాండీవ ధన్వి భూ
మండ లేశ్వర వక్త్ర
మండలమ్ములఁ గప్పె
నిండు ధారల నీవు
నెత్తమ్ములం బోలె.

క్రొమ్మెఱుపు...

**46**

పరమ బంధువు లైన
    కురు పాండవుల స్నేహ
గరిమ మై నాలమ్ము
    దొరఁగి నాఁగలి తాల్పు
ప్రియ మయ్యు రేవతీ
    నయ నోత్ప లాంకిత
మ్మయిన హాలా రసం
    బట వీడి యేనదీ
జలము సేవించె నా
    సారస్వత పవిత్ర
సలిల మాని యఘమ్ముఁ
    దలఁగి యంత శ్శుద్ధి
గలవాఁడ వగు మయ్య!
    జలద! నీవును; నీకు
నలుపు కేవలము వ
    ర్ణమున నే యగుఁగాక!

క్రొమ్మెఱుపు...

**47**

జలధరా! యవల ఖన
ఖల పర్వతము పొంత
వలి గట్టు నం దుండి
యిలకుఁ డిగిన యట్టి
సగ రాత్మజుల స్వర్గ
సోపాన పంక్తి యౌ
గగన గంగను ప్రీతి
గదురఁ జేరఁ గ దయ్య!
హరుని యౌదల నెక్కి
తరఁగ చేతులు సాఁచి
హారి నిందు లేఖతోఁ
బొదివి జుట్టును బట్టి
కనుబొమల్ ముడి వెట్టు
గౌరి మోమును జూచి
యనయము నురుంగు గమి
నా గంగ నగు చుండు.

క్రొమ్మెఱుపు...

**48**

వెనుక సాఁబాల్ మింట
ప్రేలాడ సుర హస్తి
యును బోలె నట ముందు
కొరగి యడ్డమ్ముగాఁ
బటికంపుఁ దెలి చాయఁ
బరఁగు నన్నది నీటి
నట నీవు ద్రావఁగా
నభిలషించెద వేనిఁ
గాలాంబు వాహ! త
త్క్షణమ యా వెల్లువఁ
నీలాల రుచు లీను
నీ నీడ సొరఁ బాఱి
కనఁగ నొండొక చోటఁ
గాళిందితోఁ గూడు
కొని నట్టు లయ్యేఱు
కొమ రారెడుం జుమ్ము.

క్రొమ్మెఱుపు...

**49**

అలసి కస్తురి మెక

మ్ములు పరుండఁగ నాభి

వలపుల౯ వాసించు

శిలలతో నొప్పారి

వలి మంచు గడ్డలం

దెలు పారి మిన్నేటి

తొలి పుట్టు కత మైన

వలి గట్టు నటఁ జేరి

కలయఁ బై కొను దారి

యలపు దీర్చెదు నొక్క

లలిత శృంగమున నీ

వెలమి మైఁ గూర్చుండఁ

జెలసి కోరాడు నా

శివు నంది కొమ్మునం

బొలుపారు కార్కట్టి

బురద సొంపు వహింతు.

క్రొమ్మెఱుపు...

**50**

సరళ శాఖుల మొద

ల్గొరయుటఁ జనియించి

కరువలిం దరికొన్న

కార్చిచ్చు, మిణుఁగురుల్

వరపి త చ్చమరికా

వాలముల్ గాల్ప, న

గ్గిరి రాజునకు నందుఁ

గీడు వాటిలు నేని

నురు వారి ధారలం

బోరిఁ గ్రుమ్మరించి స

త్వరమ తద్బాధ యం

తయును జల్లార్పుమీ

గురుత రాప న్నిమ

గ్నుల యార్తిఁ బాపుటే

ధర నుత్తముల సంప

దకు ఫల మ్మగుఁ గాదె!

క్రొమ్మెఱుపు...

**51**

ద్విరద విభ్రాంతి న
　　　　గ్గిరి మీఁద శరభముల్
సరభసమ్మున నిన్నుఁ
　　　　బొరిగొనం దుముకఁ ద
త్సరణికిం దొలఁగు మ
　　　　త్తటీ గాత్రములు వ్రయ్య
ధరఁ గూలు నవియు నం
　　　　తటితోన షా నీక
యొడ తెంపు లే నట్టి
　　　　వడగండ్ల వాన బి
ట్టడరించి వాని యే
　　　　పుడుపు మయ్య! పయోద!
ఫలకారి గా నట్టి
　　　　పనులకుఁ దొరఁకొన్న
పలువ లెందును మహా
　　　　పరిభూతి పాల్గారె!

క్రొమ్మెఱపు...

**52**

అట నొకానొక తాతి
యందు సంతత సిద్ధ
పటల పూజిత మైన
భవు పదాంబుజ ముద్ర
గనుపట్టు నద్దాని
కిని సభక్తికముగా
వినతుండ వగుచు వల
గొను మయ్య! జలవాహా!
దానిఁ గన్గొను శ్రద్ధ
ధాను లుద్ధుర సంచి
తైనో నికాయమ్ము
నెడఁబాసి యిందు నె
మ్మేనులఁ విడిచి యా
మీఁద సుస్థిర గణ
స్థానమ్ము నొంది శా
శ్వతు లయ్యెదరు సూవె.

క్రొమ్మెఱుపు...

**53**

నిరతమ్ము గాలులన్
　　　　నిండు బొంగు వెదుళ్ల
సురుచిర ధ్వని కల
　　　　శ్రుతుల నీనుచు నుండ
నవ్వేణు రుతి వెంట
　　　　నంటి కిన్నర సతుల్
ముప్పేటి గెలుపు పెం
　　　　పును బాడ నవ్వేళ
గవుల మార్మ్రోగు నీ
　　　　కమనీయ గర్జితా
రవము గంభీర మ
　　　　ర్దల నాద మగు నేని
రంగారఁ దాండవా
　　　　రంభి యా శూలికిన్
సంగీత మచ్చోట
　　　　సంపూర్ణ మగుఁ జుమ్ము.

క్రొమ్మెఱుపు...

**54**

ప్రాలేయ గిరి తటో
　　　　పాంత భూములయందుఁ
గ్రాలు నాయా విశే
　　　　షాలఁ జూచుచుఁ బోయి
పరశు రాముని కీర్తి
　　　　పథము నంచలు వోవు
సరణి యానా క్రౌంచ
　　　　గిరి బిలమ్మును జొచ్చి
సరిగ నడ్డమ్ముగాఁ
　　　　జక్కఁగాఁ జాఁగి యు
త్తర దిక్కునకును న
　　　　త్వరముగాఁ బోవయ్య!
బలిని బంధింప నం
　　　　బర తలంబునఁ బర్వ
నల విష్ణుదేవు శ్యా
　　　　మల పాదముం బోలె.

క్రొమ్మెఱుపు...

**55**

అల క్రౌంచ రంధ్రమున్
వెలలి మీఁదుగ నేగి
బలిమి రావణుఁ డెత్తఁ
బగులు నెత్తముల సం
దులు గల్గి వేల్పు టిం
తుల మించు టద్ద మై
పొలు పారు కైలాస
మునకు విందవు గమ్ము
కలువ పూవుల చాయఁ
దెలు పారు ఘన శృంగ
ములతోడఁ గూడి మి
న్నులు రాయు నా వెండి
మల యొప్పు బహు దిన
ములనుండి ప్రోవైన
యలికనేత్రుని యట్ట
హాస రాశియ పోలె

క్రొమ్మెఱుపు...

**56**

నునుపుఁ గాటుక చాయ

గనుల పండువు సేయఁ

దన రారు నీవు నె

త్తమున వ్రాలిన యంత

నలుగునన్ బలిమిమై

నపుడ త్రుంచిన యేన్గు

పలు తున్కయుం బోలెఁ

దెలు పారు నకొ్కండ

కను తెప్ప వేయకే

కనుఁగొనం దగి నట్టి

కనువిం దయిన వింత

కాంతిఁ దాల్చెదుఁ జూవె

బలుపు మూఁపున యందుఁ

జెలు వైన క్రొన్నెలి

వలువ దాల్చిన యట్టి

బలరాముఁడుం బోలె.

క్రొమ్మెఱుపు...

**57**

లీలాద్రి యైన యా
కైలాసమున యందు
వ్యాళ కంకణము ముం
గేలఁ దాల్చుట మాని
శూలి కైదండ యీ
లీలఁ గాల్నడక నా
శైల పుత్త్రిక ప్రీతి
సంచరించెడు నేని
నీ లోని నీళులన్
నెఱి గట్టి వడఁ జేసి
మోలి నీ యొడలు ప
ర్వాలు గా విరచించి
యా లేమ మణి తటా
గ్రారోహణము సేయ
నీలాల నును మెట్ల
చాల వై కొలువుమీ.

క్రొమ్మెఱుపు...

**58**

కడు వాఁడి వజ్రంపుఁ
గడియాల యంచులన్
నిడుద గంటులు వెట్టి
నీ రోడిగిలఁ జేసి
యెద వేడ్కమై వేల్పుఁ
బడఁతు లయ్యెడ నిన్ను
జడ యంత్ర గృహముగాఁ
జలిపి క్రీడింతు ర
మ్మడఁతు లం దొక వేళ
మందు వేసవిని జే
పడి నట్టి నినుఁ బట్టి
విడువ కుందురు రేనిఁ
దడయ కాటల వారు
దవుల వీనులు సెవు
డ్పడఁ జేయు నుఱుములన్
జడిపించి చను మయ్య!
క్రొమ్మెఱుపు...

**59**

పసిఁడి తమ్ముల కున్కి
పట్టైన యట్టి మా
నస సరోవరము నం
దలి నీరు గ్రోలు చ
క్కొలనఁ గ్రీడించు వే
ల్పుల యేనికకు మోము
వలువ వై క్షణకాల
మెలమి సేకూర్చుచున్
లలిత కల్పక కిసా
లయ దుకూలమ్ములన్
మలయు నీ పిల్లగా
లులచేఁ గదల్చుచున్
జలధరా! వివిధ లీ
లలఁ దేలుచు నిజేచ్ఛ
నల శైలరాజమ్ము
ననుభవింపఁ గదయ్య!

క్రొమ్మెఱుపు...

**60**

చదలేటి వలిపమ్ము
చక్కఁ గ్రిందికి జాఱ
నొడిగి యుజ్జ్వల భంగి
నుచ్చైర్విమాన నై
జలబిందువులఁ జిల్క
జలద బృందము మీఁద
నలమి ముత్తెపు సరుల్
గల ముంగురుల బెడం
గొలుకఁ గైలాస శై
లోత్సంగ తల మందుఁ
జెలికాని తోడ మీఁది
చెలి వోలె నలరు మా
యలకఁ జూచిన యంతఁ
దెలిసికోఁ గల వీవు
జలద! సంతత కామ
చారి వౌదు గ దయ్య!

క్రొమ్మెఱుపు...

## మొయిలు రాయబారము

కలిమి చెలి కాఁపురము మాయల

కా పురము సొబ గెందుఁ గలదా?

జలద! నీ క్రొమ్మెఱపుఁ జూపులు

సఫలముగ నది చూడ వలదా!

**1**

చెలులు మెఱపుల యొఱపు లీనఁగఁ

జిత్తరులు హరివిండ్లఁ బోలఁగఁ

గులుకు మద్దెల రవళు లుఱుముల

యులివులం దలపించు చుండఁగఁ

గలికి రతనపు నేల లంత

ర్జలము దొరయఁగ మిన్నొరయు మా

యలక మేడలు నిన్ను నున్నతు

జలధరా! సరిపోలెదున్.

కలిమిచెలి...

**2**

కరమునఁ లీ లారవిందముఁ
గురులయందును బాలకుందము
సురుచిరానన మందు లొద్దుగ
విరిదుమారముఁ గ్రొమ్ముడిని లేఁ
గురవకమ్మును జెవిని దిరిసెన
విరియుఁ బాపట నీదు రాకం
బొరయు నీప సుమమ్ముఁ దాల్తురు
పొల్తు లెప్పుడు నప్పురిన్.
కలిమిచెలి...

**3**

నిత్య పుష్పములై మదాళుల
నిస్వనమ్ముల నొప్పు మ్రాఁకులు
నిత్య పద్మము లగుచు హంసక
నికర మేఖల లూనుఁ గొలఁకులు
నిత్యమును బురి విప్పి యాడుచు
నిక్కి పాడును భవన కేకులు
నిత్యమును వెన్నెలలఁ గాయుచు
నిశలు భాసిలు నప్పురిన్.
కలిమిచెలి...

**4**

చెలులఁ దోకొని ప్రతిఫలించెడు
చిన్ని చుక్కల పూలు పఱచిన
చలువ క్రొన్నెల ఱాతి నేలల
చంద్రశాలల నెక్కి జక్కులు
చెలఁగి మద్దెల లుఱుము లుఱుమఁగఁ
గలికి పాటలు నాట లొప్పఁగ
మలసి రతి ఫల మైన కల్పక
మధువుఁ గ్రోలుదు రప్పురిన్.
కలిమిచెలి...

**5**

సురల నువ్విళు లూర్చు కన్యలు
సురధునీ ఘన సైకతమ్ములఁ
దరఁగ గాలులఁ దటరు హామర
తరుల నీడలు నలఁత వాపఁగ
సురిఁగి బంగరు టిసుక కుప్పలఁ
జొనిపి డాఁచిన మణుల వెదకుచు
నరుస మొప్పఁగ గూఢ మణి యను
నాట లాడుదు రప్పురిన్.
కలిమిచెలి...

**6**

పెరిమ నీవులు సడలి జాఱెడు
ప్రియుల వలువల వణఁకు మీఱెడు
కరములన్ రహిఁ బ్రియులు లాగఁగఁ
గరము సిగ్గున మ్రగ్గి యచ్చెలు
లరిది దీప్తుల రత్నదీపిక
లార్పఁ గుంకుమ చూర్ణ ముష్టులఁ
బరపి నిష్ఫల యత్నలై తడఁ
బాటు నొందుదు రప్పురిన్.

కలిమి చెలి...

**7**

కేళిఁ దనిసిన ప్రియులు తమ కవుఁ
గిళ్ల సడలుప రతుల బడలిన
గోలలను నడిరేల నీ మఱుఁ
గుం దొలంగి వెలుంగు శశి కర
జాలములచేఁ గరఁగి చల్లని
జల లవమ్ముల సారెఁ జిలుకుచు
మేలు కట్టుల వ్రేలు క్రొన్నెల
రాలు దేర్చెడు నప్పురిన్.

కలిమిచెలి...

**8**

ఘన విమాన చయాగ్ర భూముల
గాలి పురికొలుపన్ భవాదృశ
ఘనులు సొచ్చి నిజోద బిందులఁ
గమ్ర చిత్ర పటాలు పాక్కెడు
పనికి నై కడు సందియంపడు
భంగి నొయ్యన ధూమ వేషము
పనుపడం గిటికీల తెరువునఁ
బైకి జాఱుదు రప్పురిన్.

కలిమిచెలి...

**9**

అనుప మాక్షయ భూరి నిధులు గ
లట్టి కాముకు లచ్చరలతో
నెనసి చైత్రర థోప వనమున
కేగి ముచ్చట లాడుకొంచును
ధనదు కీర్తిఁ గల ధ్వనిం బయి
స్థాయిఁ బాడెడు కిన్నరులతో
ననుదినమ్మును గూడి వేడుక
లనుభవించెద రప్పురిన్.

కలిమిచెలి...

**10**

కురుల నుండి సురాగ సుమములు
గొప్ప కొప్పుల నుండి ముత్తెపు
సరులు చెక్కుల పత్రములు చెవి
సందు నుండి పసిండి తామర
లురు కుచమ్ముల నుండి హారము
లురలి రే లభిసారికల్ వడి
నరుగు దారి నెఱుంగఁ జెప్పెడు
నప్పురమ్మునఁ బ్రొద్దుటన్.

కలిమిచెలి...

## 11

అలధనేశ్వరు చెలిమి నచట స్వ
యమ్ముగా నిట లాతుఁ డుండుట
నళి గుణమ్మగు విల్లు దాల్ప భ
యంపడుఁ మదనుండు తలఁచుగఁ
గలికి బొమముడి విండ్ల వెడలుచుఁ
గామి లక్ష్యము లందమోఘత
నలరు చెల్వల చూపుఁ దూపులె
యతని పని నెఱవేర్చెడున్.

కలిమిచెలి...

## 12

పలురకపు వలువలును గనులకు
విలసనము లలవఱచు మధువును
నలరులును లేఁజివురులును వివి
ధాభరణములుఁ జరణ పంకజ
ములకు లత్తుక రంగు పూఁతలు
మొదలుగాఁ గల వింత తొడవులఁ
జెలుల కెప్పుడు నందు వేలుపుఁ
జెట్టులే సమకూర్చెడున్.

కలిమిచెలి...

**13**

ఇట్టి సొంపుల కాటపట్టయి నట్టి
యలయలకాపుర మ్మందు ధనేశు
నగరికిఁ గడుఁ జేరువగ నుత్తరమున
నింద్ర చాపము వోలె నింపారు చున్న
మణి తోరణమ్ముతో మా యిల్లు సఖుఁడ!
దూరమ్మునకె చక్కఁ దోఁచెడుం జుమ్ము!;

మా యింటి ముందట నా యింతి కరము
పెరిమఁ బెంచిన యట్టి పెంపుడు బిడ్డ;
చేతి కందుచు నున్న చిన్ని క్రొంబూవు
గొలల వ్రేఁగున వంగు కొమ్మలతోడి
వర బాల మందార తరు వొండు గలదు.

## 14

మఱియు మా లోఁగిట మరకత మణుల
మెట్లతో వైదూర్య మృదు నాళము లయి
విరియు బంగారు తామర పూలతోడఁ
గను విందు గొలుపు బొడ్డన బావి గలదు;
ఆ బావి విమల తోయముల యం దుండు
రాయంచ గములు నీ రాకఁ జూచియును
నులు కేది యిమ్ముల నుండెడుం గాని
దరి నున్న మానస సరసికిం బోవు.

## 15

అల బావి యొడ్డున లలి తేంద్ర నీల
కలిత మా శిఖరమ్ము గలిగి పసిండి
యరఁటి చెట్టులు చుట్టు నలమిరో నొక్క
క్రేళి శైలమ్ము చూడ్కికి వేడ్క సేయు;
చెలికాఁడ ! నా ప్రేయసికిఁ బ్రియ మ్మగుట
మెఱుపుఁ దీవలతోడ మేఱయు నిను జూచి
యతి కాతరం బైన యంతరంగమున
నిప్పు డద్దాని నే యిచట నేఁ దలఁతు.

## 16

గోరంట వెలుఁగుతోఁ గొమరారు బండి
గురివెంద తీవ చప్పరపు మేల్చవికె
కొక వంకఁ బొగడ వేఱొక వంకఁ బ్రచల
కిసల రక్తాశోక మెసలారు నందు;

ఆతత ప్రీతి మై నా తోడఁ గూడ
నతుల దోహద మిష నా నీదు సకియ
పుక్కిటి మధు రసమ్మును గోరు నొకటి
తనువు డా కాలి మన్ననఁ గోరు నొకటి.

## 17

చెలు వారు నా రెండు చెట్టుల నడుమ
ముదిరియు ముదురని వెదురు డా ల్గదురు
పచ్చ లా యరుఁగుపైఁ బటికంపుఁ బలక
గల మన్కిపట్టు పా న్గడ యొండు గలదు;

గల్లు గల్లునఁ జేతి కడియముల్ మ్రోయఁ
దాళ సంగతుల నా తరుణి యాడించి
విడువ నప్పలకపైఁ గడ సంజ వేళ
నీదు నెచ్చెలి నెమ్మి నెమ్మి మై నుండు.

**18**

వాకిటి కిరు వంక వ్రాయంగఁ బడిన
శంఖ పద్మమ్ములం జక్కఁ గన్గొనియు
నెద నిల్పికొని యున్న యీ యానవాళ్ల
మా యిల్లు దెలిసికొమ్మా! సాధు వర్య!
ఇపుడు తప్పక నాదు నెడఁ బాటు చేతఁ
జె న్నేది మా యిల్లు విన్ననై యుండు
మార్తాండుఁ డస్తాద్రి మాటున కరుగ
నిజ కాంతిఁ గో ల్పోదె నెత్తమ్మి పూవు.

**19**

వేగంబ చొరఁబాఱ వీ లగు నట్లు
గున్న యేనుఁగు పాటి కొలఁది మైఁ దాల్చి
యందంపుఁ జఱియల నల రారు చున్న
య క్కేళి నగముపైఁ జక్కఁ గూర్చుండి
మిణుఁగురుం బురువుల మిసిమి కీడైన
యత్యల్ప కాంతితో నప్ప టప్పటికి
మిస మిస లాడు నీ మెఱుఁగుఁ జూపులను
భవనమ్ము లోనికిం బఱపం గదయ్య!

### 20-21

మెఱపుఁ దీవియఁ దెగడు
మేను గల లతకూన
బెడఁగు నడి జవ్వనపు
బిగువు గల జవరాలు
కొనలు వాఱిన పల్లుఁ
గ్రొన్ననలు గల సుదతి
పరువంపుఁ గెందొండ
పండు వాతెఱ నాతి
వడఁకాడు బడుగు నె
న్నడుము గల యెలనాగ
బెదరు లేటి పొలంతి
బెళుకుఁ జూపుల యింతి
కడు లోఁతు పాఁతు గల
సుడి పొక్కిలి వెలంది
పిఱుఁదు బరువున నంచ
పెంటి నడ గల పడఁతి

# మొయిలు రాయబారము

వలుద చనుఁగవ సుంత
　　వంగువాఱు మిటారి
చెలువలను బనిఁ బూని
　　సృజియింప దొరఁకొన్న
నలువ తొలుతటి శిల్ప
　　కళ యనఁగఁ దగు మగువ
కవవాసి నొగులు జ
　　క్కవ వెంటి వలె నొంటి
సహచరుఁ ననుఁ బాసి
　　జాలి గొను వాల్గంటి
మిత కలాలాప యం
　　చిత సద్గుణ కలాప
నా యింటఁ గనుపట్టు
　　నాదు రెండవ ప్రాణ
మదియ యంచు నెఱుంగు
　　మయ్య! నెచ్చెలికాఁడ!

# మొయిలు రాయబారము

ఈ దీర్ఘ దివసముల

నెటులో వేఁగించుచును

మంచుఁ గారునను దా

మర తీవయుం బోలె

గాట మగు నెడఁబాటు

కాఁకలను వసి వాడు

బోటి రూపము మాఱి

పోయి యుండఁగ వచ్చుఁ

బెను వంత నింత మా

ఱిన యంత మాత్రాన

నది నా నెలంత గా

దనుకోకు మీ నీరదా!

## 22

ఎడతెంపు లేనట్టి యేడ్పుల చేతఁ
గర ముబ్బి యున్న వా ల్గందోయి తోడఁ
గడు వేఁడి నిట్టూర్పు గాడ్పుల చేత
వన్నె దొఱంగిన వాతెఱ తోడఁ
గూడి ప్రేలాడు ముంగురులలో నొదిగి
తోఁచియుం దోఁపక తో బూచు లగుచు
జెయిఁ జేరఁబడు నారి చిన్నారి మొగము
నీ యడ్డ పాటున నిజ రుచిం దొఱఁగు
నల చందమామ దైన్యము నొంది యుండు.

# మొయిలు రాయబారము

**23-24-25**

నా రాక నెమ్మదిం
గోరి యయ్యెడ దేవ
తారాధనము బత్తి
నాచరించుచు నుండి యో
యెడఁబాటు వగపు చే
బడు గైన నా రూపు
దడ వెడఁద భావించి
తవిలి వ్రాయుచు నుండి యో
ఆ కలికి తోలు దోలుత నీ కంటఁ బడు నంచు
నాకుఁ దోఁచెడు మిత్రమా !

నీ మీఁద రహిం గలుగు
సామిఁ దలఁతువె యనుచు
నామోద మఱి పంజ
రాంతరమ్మున నున్న
గోము గల కల వాణి
గోరువంకను జేరి
ప్రేమమ్ము నిండారఁ
బ్రీతి నడుగుచు నుండి యో

## మొయిలు రాయబారము

మలిన వస నావృతిని
జెలు వేదు తొడ మీఁదఁ
గల వీణ నిడికొంచు
లలి మ దంకితము లగు
వలపుఁబాటలు వాడఁ
దలఁచు చోఁ గన్నీళ్లు
జలజల దొరంగి తీఁ
గలు దడియు చుండ ని
చ్చలు నెటులో తుడుచుచును
బలు మఱుం గలకఁ దన
తొలి కూరిచిన మూర్ఛ
నలనె మఱచుచు నుండి యో
ఆ కలికి తొలు దొలుత నీ కంటఁ బడు నంచు
నాకుఁ దోఁచెడు మిత్రమా!

## మొయిలు రాయబారము

తక్కు నెడఁబాటు నెల
లొక్కొకటి గాఁ గడప
చక్కి నిడు పూల తో
లెక్కిడుకొనుచు నుండి యో
మక్కువను భావ గతి
నెక్కొలుపు సంభోగ
మక్కఱకుఁ దెచ్చికొని
యనుభవించుచు నుండి యో
ఆ కలికి తొలు దొలుత నీ కంటఁ బడు నంచు
నాకుఁ దోఁచెడు మిత్రమా!

ఇవి యే కదా ప్రియుల
యెడఁబాటులను దఱచు
ఉవిదలకుఁ దగు వినో
దోపాయములు మిత్రమా!

## 26

పగటి తఱి నాయాయి

పని కల్మి నెడఁబాటు

నెగు లంతగా నొంప

నేర దయ్యది రేయిఁ

దగు వినోదము లేమి

ద్విగుణ మై కలఁచు న

ట్లగుట నేలఁ బరుండి

పొగులుచుఁ నిదుర లే

కగచాట్లు పడు చుండు

నాసతిని నడు రేయి

నట సూచి యమ్మేడ కిటికీ పయిని నుండి

తటుకునను నా వార్తఁ దరుణికిని వినిపించి

తనియింపు మోయంబుదా!

**27**

కొలఁది మీఱు మహాధిఁ
గొని కృశించిన దానిఁ
దొలి దిక్కు మొగ నొక్క
కళతోడి నెల వోలె
నలరుఁ బాన్పున నొత్తి
గిలి పరుండిన దాని
నెలమి నాతోఁ గూడఁ
దొలి యిచ్చ మెయిఁ గేళి
సలుప నిముసము వోలె
జరగి పోయెడు రేయి
కొల మీఱి యిపు డేచఁ
గ్రొవ్వేఁడి కన్నీళ్లఁ
గలఁత మెయి నెట్టు లో
గడపు చుండెడు దాని
నట సూచి యమ్మేడ కిటికీ పయిని నుండి
తటుకునను నా వార్తఁ దరుణికిని వినిపించి
తనియింపు మోయంబుదా!

## 28

జాల మార్గము నుండి చల్లనగు చంద్ర పా
దాలు రాఁగాఁ దొంటి తమినెదు రరిగి తెఱఁగు
మాలి యరిగిన యట్ల మరలిపోయిన చూడ్కిఁ
జాల వెతఁ గన్నీటి చాలు జాల్కొనఁ బొదువు
లీల తెప్పల నప్పళించుచును నఱ మోడ్పుఁ
గ్రాలుఁ గందోయి తో సోలుచును దుర్దినపు
వేళ ముకుళింపకయు వికసింపకయు నుండు
నేల తామర తీవ వోలెఁ దోఁచెడు దాని
నట సూచి యమ్మేడ
కిటికీ పయిని నుండి
తటుకునను నావార్తఁ దరుణికిని వినిపించి
తనియింపు మో యంబుదా!

## 29

పలుగప్పఁ జివురు బీఁటలు వాఱ నొండొండ
యొలయు పెను వేఁడి నిట్టూర్పు గాడ్పులచేతఁ
దలయంటు లేకుండ జలకమ్ము లాడుటం
జెలు వేడి బిరు సెక్కి తెలి చెక్కులను వ్రేలు
నలక జాలమ్ములను దొలఁగ ద్రోసెడు దానిఁ
గల నయిన నా పొందు గలుగు నేమో యనుచుఁ
దలఁచి నిద్దుర మీఁది వలపు నించెడు దానిఁ
గలఁక మెయిఁ బొరిఁ బొరిం దొలఁకు కన్నీళ్లు పె
ల్లలమి నిద్దుర రాక యలఁత సెందెడు దాని
నట సూచి యమ్మేడ
కిటికీ పయిని నుండి
తటుకునను నావార్తఁ దరుణికిని వినిపించి
తనియింపు మో యంబుదా !

## 30

విరిసరులఁ దొఱఁగి తొలి
విరహ దివసము నాఁడె
సరగ సిగ గట్టుకొని
శాపాంతమున నేన
యరుసమున నరుదెంచి
యది విప్పవలె నన్న
యరిది పూనిక కల్మి
నది యొక్క జడ గట్టి
బిరుసువడి విషమ మయి
పెను నొప్పి యిడ దానిఁ
బెరుఁగు గోళులతోడి
కరముతోఁ బలుమాఱు
విరివి చెక్కిలి నుండి
వెను ద్రోసికొను దాని
నట సూచి యమ్మేడ కిటికీ పయిని నుండి
తటుకునను నావార్తఁ దరుణికిని వినిపించి
తనియింపు మోయంబుదా!

### 31

తొడవులు విడనాడి కడు మెత్తనైన
యొడలు సారెకు దుఃఖ మొదవఁ బానుపునఁ
జేర్చు నయ్యబలఁ జూచినఁ దప్పకుండ
నీకును నొదవుఁ గ్రొన్నీటి కన్నీరు
ఆర్ద్రహృదయులు దయామయుల్ గారె.

### 32

నీదు నెచ్చెలికి నా మీఁద నున్నట్టి
యెడలేని యాప్రేమ నెఱుఁగుదుం గాన
నెడఁబాటు మున్నెన్నఁ డెఱుఁగని దగుట
నిట్టి దొనది యంచు నెంచితిం జూవె
యందమ్ము గలవాఁడ నన్న గర్వమ్ము
నను నిట్లు ప్రేరించె నని యెంచకయ్య!
నే నన్న దిది యెల్ల నేఁ డెల్లి నీకుఁ
దమ్ముఁడా! యచటఁ బ్రత్యక్ష మై తోఁచు.

## 33

వ్రేలాడు ముంగురుల్ గ్రేఁగంటి చూపు
నడ్డుకోఁ గాటుక జిడ్డైన లేక
మధుర మా మధు సేవ మానుటం జేసి
బొమ విలాసమ్ముల బొత్తిగా మఱచి
కడు సోలు నవ్వాలుగంటి డాకన్ను
దరికి నీవేగఁ దాఁ బొరిఁ బొరి నదరి
మీను లోలోఁ గొట్టుకో నట్టి కదలు
కలువ పూ సిరి తోడఁ దులఁ దూఁగుఁ జూవె.

## 34

ఘన! నాదు కొనగోటి గంటులు లేమిఁ
దడవుల నలవాటు పడిన ముత్యాల
చేరుల దైవమ్ము చెయ్దిఁ బోనాడి
యరఁటి కంబము వోలె నతి గౌర మగుచు
బలిమి నేసుర తాంతముల నొత్తుచుండు
నలివ డా తొడ గూడ నదరెడుం జుమ్మ.

**35**

చెలియ యత్తటి నరిది నిద్దురఁ
జెంది యిమ్ముల నుండు నేనియు
జలద ! యుఱుముల మేలుకొలుపక
జాము సేపట వేచి యుండుము
కలను బ్రియు నను నెట్టకేలకుఁ
గాంచి గాటపుఁ గౌఁగిలింతలఁ
జెలువ పొందెడు సౌఖ్య సంపదఁ
జెఱుపఁగా దొరఁకొకుమీ.



96 నిద్రిత-యక్షాంగన

**36**

నెలఁతుకం బిదప నీ నీటి తుంపురులఁ
జల్ల నౌ గాలి చేఁ జక్కఁ మేల్కొలిపి
మొల కెత్తు లే జాజి మొగలతోఁ గూడ
సేదఁ దేర్చి గవాక్ష సీమఁ గూర్చున్న
నీ వైపు నిశ్చల నేత్ర యై చూచు
నమ్మాన వతి తోడ నతి ధీర వృత్తి
మెఱపు లో నణఁచి నీ యుఱుముఁ బల్కులను
గడఁక మై నిటు వల్కఁ దొడఁగుమీ సఖుఁడ!

**37**

అమ్మ! యైదువరాల! నీ పతి
　　కనుఁగు మిత్రుఁడ నతని వార్తల
నెమ్మనమ్మున నిలిపి చయ్యన
　　నీకుఁ దెలుపఁగ నిటకు వచ్చితి
వెమ్ము తమ ప్రియ తమల జడలను
　　విప్పఁ దహ తహ పడెడు పాంథుల
నుమ్మలిక వోఁ జెవుల విందగు
　　నుఱుములను ద్వర పెట్టి పంపెడు
క్రొమ్మొయిలు రాయఁడను నే నిది
　　నమ్ము మమ్మ! సతీమణీ!

**38**

అని పల్కి నంతనే యా సాధ్వి యలరి
జనక పుత్త్రిక వాయు తనయునిం బోలె
నెద వేడ్క విరియ మో మెత్తి నిక్క గాంచు
మన్నించుఁ దవిలి నీ మాట లాలించు
నెడఁబాటుఁ గా రగ్గి నెరియు చెల్వాలకుఁ
జెలికాఁడు దెచ్చిన చెలువుని వార్త
తమి నించు మించు కూటమి సాటి గాదె.

**39**

పరుల మే ల్గోరి జీవనమును బుచ్చు
పర మోపకారి ! నా ప్రార్థ నోక్తులను
జెల్లించుటకును మేల్ సేసి నీ యంత
నినుఁ గృతార్థుని జేసికొనుటకుం గూడ
నిటు చెప్ప నొప్పు నా యింతితో మొదట
"నీ భర్త యెడఁబాటు నెగు లోర్చి బ్రదికి
రామ గిర్యాశ్రమ సీమ నున్నాఁడు
అబల ! నీ దగు సేమ మడుగు మన్నాఁడు"
అని పల్కు మాపన్ను లగు వారి తోడఁ
దొలు దొల్త ననఁ దగ్గ పలు కిదే కాదె.

## 40

దా దాలఁ దూలి పగ

దారి దైవము చెఱ్ఱు

నినుఁ జేరుకొను దారిఁ

గన లేక నీ విభుఁడు

కడుఁ జిక్కి గాటంపుఁ

గాఁకలను సుడు కెక్కి

కన్నీళ్ల నాని యు

త్కట వేదనం బూని

యొండొండ వేఁడి ని

ట్టూర్పు గాడ్పులఁ బుచ్చు

నట్టి తన మేనితో

నట్టిదగు నీ మేనఁ

గడ లేని వివిధ సం

కల్ప కల్పనలఁ గా

వించి తా నేకీభ

వించు చున్నాఁ డమ్మరో!

## 41

చెలులక ట్టెదుట నీ
చిన్ని నెమ్మొగ మంటఁ
గలుగు నను నాస మొయి
వెలికిఁ జెప్పఁగఁ దగ్గ
పలుకు లే య య్యు న
ర్మిలి రహస్యము వోలెఁ
జెలువ ! నీ చెవిలోనఁ
జెప్పఁ దివి రెడివాఁడు
తొలఁగి కనఁగా వినఁగ
నలవి గా నట్టి ద
వ్వుల నున్కిఁ జేసి నీ
చెలువుఁ డిప్పుడు మహో
త్కలికా రచిత పదా
వళుల నా నోటఁ దన
పలుకులుగ నీ తోడఁ
బలుకు మనె నా యిమ్మొ
యిలు రాయబారమ్ము
కలికి! యిదె యాలింపుమా.

"జీవి తేశ్వరి! నిన్నుఁ బాసి యు
జీవములతో నుంటి నకటా!
దేవి! యీ కఠినాత్ము దుర్దశ
తెలుఁ గొ కించుక వినఁగ దే.

**42**

అలరుఁ దీఁగల మేని సోయగ,
మదరు లేళుల యందుఁ జూపుల
బెళుకు, చందురు నందు వదనము
చెలువు, నెమిళుల పురుల వేనలి
పొలుప, మేటి యలంతి తరఁగల
బొమల సొబగును జూతు నెప్పుడుఁ
గలికి! నీ నెఱపోల్కి యొకచోఁ
గానఁబడ దది యెందు నయయో!
జీవితేశ్వరి!...

## 43

పాల యలుకఁ గొని యున్న నిన్నొక
పలుఁగు సిలపై ధాతు రసములఁ
బోలితి యేర్పడ వ్రాసి నీ యడు
గులను బడి నటు నన్ను వ్రాయఁగఁ
దలఁచి నంతన సారె బాష్పము
లొలికి చూపరికట్టి చిత్రముఁ
గలఁచెఁ జిత్తరు వందు నైనను
గరుణ మాలిన కటికి దైవము
పొందఁతి మన కూటమిని సైఁపక
పోయె నెంతటి పాప మయయో!
జీవితేశ్వరి!...

## 44

కలలలో నిను నెట్టకేలకుఁ
గాంచి బిగ్గఁ గవుంగలింపఁగఁ
దలఁచి చేతులు రిత్త బయలికిఁ
దార్చుచుండెడు నన్నుఁ గన్గొని
కెలని కానన దేవతలు తరు
కిసలయమ్ముల మీఁద ము త్తెపుఁ
గోలఁదు లగు కన్నీటి బొట్టులు
గురియుదురు పలు మాఱు నయయో!
జీవితేశ్వరి!...

**45**

చెలియ ! యప్పుడ దేవదారుల
          చివురుఁ దొప్పలఁ ద్రుంచి గంటుల
నొలుకు కమ్మని పాల తావుల
          నూని వలపలి దెసకు నెవ్వడిఁ
బొలయు వలిమల గాలులకు నట
          మున్ను నీమెయి నంటు భాగ్యము
గలిగి యుండు నటంచు వానినిఁ
          గౌఁగిటం గదియింతుఁ జూవే.
                    జీవితేశ్వరి !...

## 46

కలయఁ దడిసిన నేల వలెఁ గడు
　　　　వలచు నీ మొగమునకు దవ్వాయి
కలఁగి బడు గయి యుండినను నను
　　　　గాముఁ డిపుడే వెతలఁ బెట్టెడు
మలసి దిక్కుల నలము దట్టపు
　　　　మబ్బులను రవిఁ గప్పి తహాతహా
గొలుపు నా జడి కారు రోజులు
　　　　చెలి ! కటా ! యెటు గడచుఁ జెపుమా!
　　　　　　　　జీవితేశ్వరి !...

## 47

నిడుద జాముల రేయి క్షణ మటు
గడచి పోవలె నెండ వేఁడిమి
యుడిగి పవలును నెపుడుఁ జల్లఁగ
నుండఁగా వలె నంచు నెంచుచుఁ
గడఁకఁ దీరని కోరికల వెతఁ
బడుచు నీ యెడఁబాటు కాఁకల
నెడఁద శరణము లేక కుతకుత
నెపుడు నుడుకుచు నుందు నయయో !
జీవితేశ్వరి !...

## 48

ఎన్నెన్నో కోరికల నెన్నుకొంచును నేన
నన్ను నిట నిలుపుకొను చున్నాఁడ నటు గానఁ
గళ్యాణి! నీవు నటుఁ గాని తలఁపుల లోనఁ
దగిలి నాకయి యట్టె దిగులు వడఁ బోకుమీ
సుకము దుఃఖమును దా నొక దాని పై నొకటి
గలుగు నేరికి నంతె కాని సతములు గావు;
ఇల దేహి దశ బండికలు కమ్మి వలె నెపుడుఁ
గ్రిందు మీఁదగుచు గిరగిరఁ దిరిగెడుం జూవె;

తెగువ సేయకు మాస
తెగఁ గోసి కొని యింక
మగువ! యిది తగదు నా
మాట యిది మన్నింపుమా!

## 49

పాల కడలిని బాఁపపాన్పు నుండి మురారి
నిదుర లేచిన నాఁడె నెలఁత ! నా శాపాంత
మీ నాల్గు నెలలు వీ వెటో కనులు మూసికొని
కడఁక మెయి నాకు నయి గడపఁగా వలెఁ జుమీ
వెలఁది యట మీఁద మన విరహ కాలము నందు
మదిఁ దలఁచికొన్న యా మన కోరికల నెల్లఁ
బండువెన్నెలలఁ గన్పండు వై యలరు శర
దమల రాత్రుల యందు ననుభవింతము గాక !

తెగువ సేయకు మాస
తెగఁ గోసికొని యింక
మగువ ! యది తగదు నా
మాట యిది మన్నింపుమా !

## 50-51

మును పొక్క రేయిఁ బాన్పున నన్నుఁ గౌఁగిటం
గదియించి యుండియును గాటంపు నిదుర లో
నేటికో బిగ్గరగ నేడ్చు చుంటివి నీవు
ఇది యేటికేయిట్టు లేడ్చెదీవని సారె
నిను లేపి యడుగఁగాఁ గను విచ్చి ననుఁ జూచి
యో మోసగాఁడ! నీ వొకతెతో నే మేమొ
సలుపు చుండిన యట్లు కల గంటి నిపు డంచు
నెలనవ్వాలయ నాకుఁ దెలిపి యుంటివి గాదె;
ఈ యభిజ్ఞానమున నేను సేమముగ ను
న్నాఁడ నంచును మదిన్ నమ్మి యుండుము నీవు
లోక వాదమ్మునకు లో నగుచు నా యెడల
జలజాక్షి! మది నొందు దలఁపఁగాఁ బోకుమీ;

ఇల న దేమో కాని
యెడఁ బాటు గలుగంగఁ
జెలుము లదవద లగుచుఁ
జెడిపోవు నని యందు
రనుభూతిం జేసి
యవి యిష్ట వస్తువున
రస తృష్ణ గొని ప్రేమ
రాసు లయ్యెడుఁ జూవె
తెగువ సేయకు మాస
తెగఁగోసి కొని యింక
మగువ! యది తగదు నా
మాట యిది మన్నింపుమా!"

**52**

మొయిలు రాయఁడ! యిట్లు మొదటి వియుక్తిఁ
జాల శోకించు నీ సకియ నోదార్చి
నంది కోరాటలన్ నలఁగు నా వెండి
మల నుండి వేవేగ మరలి యేతెంచి
తగిన గుర్తుల తోడఁ దర ఛాయ తాల్చి
పంపిన సేమంపు వార్తలం దెల్పి
వేఁ బోక తఱి మల్లె విరి వోలెఁ బ్రిదిలి
తలరు నా జీవమ్ముఁ నిలుపంగ దయ్య!

**53**

బదులాడ వేమి? యీ బంధు కార్యమ్ము
ననఘ! నీ వొప్పు కొన్న ట్లే క దయ్య!
బదులు వల్కుట నీదు పరమ గంభీర
భావమ్మునకును లోపమ్ము యగా నౌను
మూఁ అడకే డప్పి మై వేఁడు కొనెడు
చాతకమ్ములకును జల మిత్తు గాదె
సత్పూరుషులకు యాచకుల కోరికలఁ
బాటించి తీర్పుటే ప్రత్యుత్తరమ్ము.

**54**

జలముచా! నీతోడి చెలిమిచేఁ గాని
విరహార్తుఁడ నటన్న కరుణచేఁ గాని
యిది నీకు ననుచితంబే నైన, నాదు
వేడికోల్ గొని నాకుఁ బ్రియము గావించి
సురుచిర వర్షాభిశోభి వై యిచ్ఛ
సకల దేశమ్ములం జరియింప వయ్య!
ఇట్లు నీదు మెఱుంగుటిల్లాలి తోడ
నీ కెన్నఁడు వియుక్తి లేకుండుఁ గాక!

(కుడి కన్నదరుట నిరూపించి)

నా కుడి కన్నదరు చున్నదే! ఏమి మేలు చేకూరునో?

(తెరలో)

నలిని రాజీ వాననము నుండి ముత్తెంపుఁ
దెలి మంచుఁ గన్నీరు దొలఁగింప ననురక్తి
యెల రార విధి యుక్తి నినుఁ డిదే దయచేసెఁ

గవ వాసి నొగులు జ
క్కవ పులుంగా! యింక
నెవు లేది వెంటితో
నీవు గూడుదు గాక!

(వినుట నభినయించి)

ఎవరు చెపుమా ఖండిత నాయికల నుద్దేశించి నా పాడిన గీతిక నే యనువదించుచుఁ జక్రవాక మిషమున మత్ప్రియా సంగమమును సూచించు చున్నారు?

(నలుగడలఁ బరికించి చూచి)

ఇం దెవ్వరును లేరే!

నా దీనావస్థకు జాలినొంది ముత్తెంపుఁ గోలఁదు లగు కన్నీటి బొట్టులు గురియుచుండు నివ్వాన దేవత లై యుందురేమో?

(ఒడలు పులకరించి, మహోల్లాసముతో)

ఆశ్చర్య మాశ్చర్యము!!

నా శాప కాలము ముగియకుండఁగనే, యస్తంగమితములైన నా దైవత మహిమ లన్నియు నాకస్మికముగా నాయం దావిర్భవించిన విది యేమి?

(ఇంచుక సేపు ధ్యానము నటించి మహానందముతో)

దుర్భర వియోగబాధ భరింపఁ జాలక నా ప్రేయసి మద్గృహ దైవతము లగు పార్వతీపరమేశ్వరుల యడుగులపైఁ బడి శరణు వేఁడుచు సొమ్మసిల్లిన నయ్యార్తశర

ణ్ణులు కరుణించి ప్రత్యక్షమై నా ప్రియురాలి నూఱడించి "బిడ్డా! నేఁడే నీభర్తం గలసికొందువు. ఇంతటి నుండి మీ కెన్నఁడును వియోగబాధ గలుగ కుండుఁ గాక!" యని వరం బొసంగి తత్క్షణమే కుబేరుని బిలిపించి నాశాపము గ్రమ్మఱింపు మనియు, నిధిరక్షణసేవకవృత్తినుండి నన్ను విముక్తునిజేసి నాసంపూర్ణ వేతన ముపకార వేతనముగా నా కొసంగుచుండుమనియు నాజ్ఞాపించి యంతర్ధానము నొందిరి.

అప్పురాణదంపతుల కరుణాకటాక్షమే నాయీశాప విముక్తికిఁ గారణము.

అమ్మయ్యో! బ్రదికితిని.

అదిగో! నాజీవితేశ్వరి మద్గృహాపంజరశారికతో నీ శుభవార్తం దెలుపుచుఁ దన పెంపుడుబిడ్డయైన మాయింటి ముందటి బాలమందారవృక్షము క్రీనీడను నిలిచి నా రాకకై యెదురుచూచుచున్నది.

ప్రేయసీ వేణి మోక్షణోత్సవము గావించుటకై వేవేగ పోయెదఁ గాక!

## మొయిలు రాయబారము

(చేతులు జోడించి)

భక్తశివంకరా! శంకరా! నీయార్త రక్షా పరతం
త్రత నెంతని కొనియాడుదును ?

మంగళము భక్తార్తి భంగ కారి కృపాత
 రంగి తోజ్జ్వల శుభాపాంగున కసంగునకు
భద్రమ్ము దేవతా విద్రావ గర్విత
 క్షుద్ర దానవ వధోన్నిద్రునకు రుద్రునకుఁ.
కళ్యాణ మురుత రామూల్యైక వృష వాహ
 పల్యంకి కారోహ లొల్యునకుఁ గల్యునకు
శ్రేయమ్ము భవ్య కాత్యాయనీ వామాన
 పాయాత్మ వామార్ధ కాయునకు గేయునకు

శూలికిఁ గపాలి కయశాలి కహి మాలికిని
బాలిత సురాలికిని బాల శశి మౌళికిని

మంగళము

నిత్య జయ మంగళ మెసంగుత సతమ్మున్.

(నిష్క్రమించును)

సంపూర్ణము.

